శ్రీగురుభ్యోనమః.

# పురాణేతిహాససారసంగ్రహము.

## ప్రథమభాగము.



ఇయ్యది

ఉరుటూరు గ్రామవాస్తవ్య

శ్రీమద్బుక్కపట్టణం తిరుమల

నః సింహాచార్య తృతీయ పుత్ర

రంగాచార్య సంగ్రథితము



పెంటపాడు,

శ్రీవైష్ణవ ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

గ్రంథకర్తచే ప్రకటితము.

**1921.**



[వెల రు ౧-౦-౦.

శ్రీగురుభ్యోనమః.

# పురాణేతిహాససారసంగ్రహము.

## ప్రథమభాగము.



ఇయ్యది




ఉరుటూరు గ్రామవాస్తవ్య

శ్రీమద్బుక్కపట్టణం తిరుమల నరసింహాచార్య తృతీయ పుత్ర

రంగాచార్య సంగ్రథితము




తద్భ్రాతృవర్యులగు శ్రీమాన్ వెంకటాచార్యులవారిచేతను,

బ్రహ్మశ్రీ విద్వాన్ శిష్టా నరసింహ శాస్త్రులవారిచేతను

పరిశోధితము.




పెంటపాడు,

శ్రీ వైష్ణవ ముద్రాక్షరశాలయందు ముద్రితము.





గ్రంథకర్తచే ప్రకటితము.

1921




[వెల రు ౧-౦-౦.




పురాణేతిహాససారసంగ్రహమనునది సాధువులకు, యోగులకు, జ్ఞానులకు, భక్తులకు, గృహస్థులకు, న్యాయవాదులకు, వ్యాపారులకు, స్త్రీలకు, పురుషులకు, విద్యార్థులకు, సన్మార్గులకు, రోగులకు, నిరోగులకు, పండితులకు, పామరులకు, సకల మతములకు, సకల జనులకు, సర్వకాలములయందు మిక్కిలి యుపయోగకరము. సర్వ మానవులు తెలుసుకొనవలసిన యనేక ముఖ్య విషయములిందు పొందుపరచబడినవి. బహు గ్రంథములను పరిశీలించుటవలని శ్రమమించుకేనియు లేక నెవరే విషయమును తెలుసుకొన గోరినను సులువుగా నీ గ్రంథమున కనుగొనగలరు. ఖండశర్కరయందు లోపలను, వెలుపలను మాధుర్యము నిండి యుండునటుల నీ గ్రంథమున నమూల్య విషయము లెన్నియో నిండి యున్నవి. ఈ గ్రంథమును పరిష్కరించుటలో నాకు మిక్కిలి తోడుపడిన శ్రీమాన్ బుక్కపట్టణం తిరుమల వెంకటాచార్యుల వారికిని, బ్రహ్మశ్రీ వేమూరి వెంకట శాస్త్రిల వారికిని, శ్రీవైష్ణవ పత్రికాధిపతి శ్రీమత్తిమరుల వీరరాఘవాచార్యుల వారికిని, శ్రీమాన్ ముత్తేవి అప్పలాచార్యుల వారికిని, బ్రహ్మశ్రీ విద్వాన్ శిష్ట్లానరసింహ శాస్త్రిలవారికిని నా కృతజ్ఞతాపూర్వక వందనముల నర్పించుచున్నాడను.

ఉరుటూరు,
పామర్రు పోష్టు, కృష్ణాజిల్లా
దుర్మతి సం॥ శ్రావణ
బ ౧ శుక్రవారము.

ఇట్లు,
బుధజన విధేయుడు,
బుక్కపట్టణం తిరుమల రంగాచార్యులు.

# విషయ సూచిక.



సంపూర్ణము.



శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.
శ్రీమతే రామానుజాయనమః.

# పురాణేతిహాససారసంగ్రహము.

అస్మద్గురుభ్యోనమః. పరమగురుభ్యోనమః.

శ్లో॥ యస్యద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతం। విఘ్నన్నిఘ్నంతమనఘం విష్వక్సేనంతమాశ్రయే॥

శ్లో॥ ప్రహ్లాదనారద పరాశరపుండరీక । వ్యాసాంబరీష శుకశౌనకభీష్మదాల్భ్యాన్ । రుక్మాంగ దార్జున వశిష్ఠ విభీషణాద్యాన్ । పుణ్యా నిమాన్ పరమభాగవతాన్ స్మరామి॥

మఱియు సంస్కృతాంధ్ర భాషాప్రవర్తకులకు నమస్కరించెద.

క. పరమబ్రహ్మమనంగా । పరతత్వమనంగ పరమ ♦ పదమనగను నీశ్వరుడన గృష్ణుడన జగ । ద్భరితుడు నారాయణుండు ♦ దా వెలుగొందున్. భాగ ॥౧॥

క. అమల మనంతవిలాసం । బమృతము సర్వగము సచ్చి ♦ దాకాశమనా। శము పరిపూర్ణము నిత్యము। సమమై వెలుగునది సర్వ ♦ సంశ్రయ మగుచున్.

వ. అంత నొక్కనాడు సకలపురాణేతిహాససారసంగ్రహము సమకూర్ప నుద్దేశించి భగవద్భాగవతాచార్యకటాక్షంబు లభింపగోరి శ్రీమన్నారాయణుని ధ్యానించుచు పరుండగా శ్రీమదనంతకోటి బ్రహ్మాండనాయకుండు అమితతేజస్వరూపుండు ఈ దాసుని కనుమోల సాక్షాత్కరించి నే నొనర్చు నుద్యమంబు నాచే నెరవేర్పింప సంకల్పించి మరునా డుదయంబున దాసుని కొకతాళపత్రంబు దొరుకు ననియు దానిచే దాసుని మనోభీష్టంబు నెరవేరు ననియు సాయించి యంతర్హితుం డయ్యె. అంతట మరునా డుదయంబున నేను

నుమేల్కాంచి నిత్యకృత్యంబుల దీర్చి శ్రీమన్నారాయణుని స్మరించి అటునిటు జూచుచుండ కొలను యొడ్డున స్వప్నగాంభగవచ్ఛాసన ప్రకారంబుగ నా కొక తాళపత్రంబు దొరకినది.

( అంచలి పద్యములు. )

తే.గీ. ఘన చిదాకాశమందున ♦ గానుపించు
ఘంటవలె మ్రోయు రవముగా ♦ నుంట చెవుల
వింట నన బ్రోవుమని వేడు♦కొంట నిన్ను. రఘుకులాబ్ధి ||౧౭||

తే.గీ. అరయ నాదంబకారంబ ♦ నాగనొప్పు
మించు కళను మకారం బ ♦ టంచు దెలసి
బిందువు నుకారమంచు సం ♦ ప్రీతి దలతు. రఘుకులాబ్ధి||౧౮||

తే.గీ. అరయ నీమూడు వర్ణంబు ♦ లమర గూడి
ఘనతరోంకార వర్ణంబు ♦ గాగ నొప్పె
అట్టి వర్ణంబు నీవని ♦ యాత్మ దలతు. రఘుకులాబ్ధి ||౧౯||

తే.గీ. ప్రణవనాద రసామృత ♦ పానరతుని
గనినయంతనె దోషముల్ ♦ గంఢడంగు
నంచు దర్శించు చుండు ర ♦ య్యార్యవరులు. రఘు, ||౨౦||

తే.గీ. కన్నగవ దేశికుని యాజ్ఞ ♦ గాంచి మూసి
బొమలనడుమ దళద్వయ ♦ కమలమందు
దృష్టి నిలుపుచు గాంతు నీ ♦ తేజ మచట. రఘు ||౨౧||

ఆ.వె. రెండు పాప లెపుడు ♦ రేబగల్ భ్రూమధ్య
దేశమునకు మలచి ♦ తేజము గను
చైక్యమొనగువారి ♦ కదిగదా మోక్షంబు. రఘు ||౨౨||

ఆ.వె. అరసి చూచు చుంటి నాకాశ ♦ పంచకా
ద్యంతరమున నున్న ♦ హంస మహిమ
నిట్టి పరమహంస మీవని ♦ పట్టితి. రఘు ||౨౩||

తే.గీ. ఫాలమునను దృష్టి ♦ బాగుగా నిల్పుచు
కమలమిత్రవహ్ని ♦ కనుల నైరి
మండలముల నడుమ ♦ నుండిన నిను జూతు. రఘు ॥౨౮॥

అట్టి భగవంతుని స్వరూప భానము లెట్టిదనిన.

## 1. పరతత్త్వ స్వరూప నిరూపణము.

శ్లో॥ జ్ఞానానందమయం దేవం। నిర్మలస్ఫటికాకృతిం। ఆధారం సర్వ విద్యానాం। హయగ్రీవ ముపాస్మహే॥

శ్లో॥ శాంతాకారం భుజగశయనం। పద్మనాభం సురేశం। విశ్వాకారం గగనసదృశం మేఘవర్ణం శుభాంగం। లక్ష్మీకాంతం కమలనయనం యోగిహృద్ధ్యానగమ్యం। వందే విష్ణుంభవ భయహరం సర్వలోకైకనాధమ్॥

మ. అణుఁడో కాక కడుఁ మహావిభవుఁడో ♦ యచ్ఛిన్నుఁడో భిన్నుఁడో,
గుణియో నిర్గుణియో యటంచు విబుధుల్ ♦ కుంఠీభవత్తత్త్వమా,
ర్గణులై యే విభుపాదపద్మభజనో ♦ త్కర్షంబులఁ దత్త్వవీ
క్షణముం జేసెద రట్టి విష్ణు బరముం ♦ సర్వాత్ము సేవించెదన్.
భాగ. ॥2॥

క. సర్వము నందును దానుం
సర్వము తనయందు నుండు ♦ సంచారంబుం
సర్వమునకు దనవలనం
సర్వాత్మకు నట్టి వృష్ణి ♦ సత్త్వము దలతుం.

గీ. అన్ని తత్త్వంబులకు నమృ ♦ తార్థతత్త్వ
మెక్కుడది యీశ్వరంబు న ♦ నీశ్వరంబు
సత్యపాకంబు నతిరహ ♦ స్యంబు దాని
గనిన మృత్యుజాలము చిక్కు ♦ గడవ వచ్చు. ॥భాగ॥

ఆనుశాసనికం—హరసనత్కుమార సంవాదము.

క. ఆదిత్య మరుద్వసురు
ద్రాదిదివిజగణము లెల్ల ♦ నవయవరూపో
త్పాదకలితు లెవ్వానికి
నా దేవుని సంస్తుతింతు ♦ హరి వేదాత్మున్.

గీ. చరణ నాభి శీర్షంబులు ♦ ధరయు నంత
రిక్షమును దివమును జగ ♦ త్చక్షు రగ్ని
దిశలు దృక్ముఖశ్రోత్రముల్ ♦ దీప్త తేజ
మాత్మునకు నట్టిసర్వలో ♦ కాత్ముదలంతు.

భీష్ములు శ్రీకృష్ణుని భక్తియుక్తుండై స్తుతించుట. శాంతిపర్వము.

క. మాసర్త్వయనాబ్దమయో
ద్భాసితరూపు డయి సృష్టి ♦ ప్రళయంబు దగం
జేసి పొలుపారు శౌరి ను
పాసింతును యోగభోగ్య♦బలు గాలాత్మున్. భారతం. శ్రీమ్మా

చార్యులవారి స్తవం.

ఆ. వె. క్షరములైన భూత ♦ సంఘుంబులందెల్ల
నక్షరస్వరూపు ♦ డై వెలుంగు
సకలబుద్ధివృత్తి ♦ సాక్షి సూక్ష్మాత్మ న
స్పందబోధు ఘనము ♦ కుందు దలతు. డిటో.

గీ. స్థావరములు జంగమములు ♦ ధాతలోను
గాగ ప్రళయంబు బొందిన ♦ కాలములను
నిలుచు నెవ్వడొకండ యా ♦ నిత్యసత్య
లలితు శార్ఙ్గి బ్రసన్నుగా ♦ గొలుతు నియతి.

క. కాలంబెడలిన విద్యో
న్మీలితమగు బోధమున్య ♦ మిశ్రత్వంబున్
దూలించి వెలుగుచుండు వి
శాలమతీ బ్రహ్మమది ప్ర ♦ శస్తము శ్రుతులన్. శాంతి.

చతుర్యుగపరిమితి.

క. తేజోరూపము బ్రహ్మము
ప్రాజాపత్యంబనంగ ♦ బరగి పురుషుడై
భ్రాజిష్ణు నిత్యసత్య
వ్యాజమహిమ వెలుగు చుండు ♦ సకలంకమతిన్.

క. వ్యాపకుడు స్రష్ట బ్రహ్మ ప్ర
జాపతి నా బరగి నిత్య ♦ సత్యాత్మతో
దీపితుడై పురుషుడు ని
ర్లేపుడు నిర్దేశముగా గ ♦ లిగి వెలుగొందున్.

క. వినుమాఅంచులు పండ్రెం
డనుపమధారలును నై నిజాస్యము ♦ విశ్వం
బును బొదువ దిరుగు కాలం
బను పక్షము దురవబోధ ♦ మదియడగు గుహన్. శాంతి. వ్యా
సుడు శుకునకు ఉపదేశించిన అంతర్యాగ ప్రకారములు.

గీ. ధరణి మొదలైన పంచ భూ ♦ తములకంటె
మనసుకంటెను బుద్ధికం ♦ టెను మహత్త
రంబు గాలంబు గాలత ♦ త్వంబు మిగిలి
యుండు విభు డిజ్జగంబుల ♦ కొడయుడతడు.

గీ. అచలు సూక్ష్ము శరణ్యు స ♦ హస్రశీర్షు
నభయకారి నశీర్షునా ♦ రాయణుని స
నాతనుని యోగమూర్తి లో ♦ కాతిరిక్తు
ధ్రువుని నీశ్వరు హరి భక్తి ♦ తోడ గొలుతు.

ఆ. వె. నిద్రబోవువేళ ♦ నిరతుడై దేహింతా
నెట్టి గుణముచేత ♦ నింద్రియముల
గడచి నట్టి సుఖము ♦ గనునట్టి బ్రహ్మంబు
కడిమి మెరయు నన్ను ♦ గానెరుంగు. భాగవతము. చిత్రకేతూ

పురాణేతిహాససారసంగ్రహము.

పాఖ్యానము.

గీ. స్వప్నమందు నెట్లు ♦ సంచారమొనరించు
మేలుగాంచి దృష్ట ♦ మెల్ల నెరుగు
నుభయ మెటుగు నట్టి ♦ యుత్తమజ్ఞానంబు
తత్త్వ ముట్టదైన ♦ తలపు నేను. భాగవతము. చిత్రకేతునకు
భగవంతుడు బోధించుట.

క. శశ్వత్ప్రశాంతు నభయుని
విశ్వాత్ముని బోధమాత్రు ♦ విభు సకలంకుఁ
శాశ్వతు సదసత్పూరుషు
నీశ్వరు జిత్తమున నిల్పు ♦ మెపుడు మునీంద్రా. భాగవతము.
నారాయణుని లీలావతార అభివర్ణనము.

సీ. భూతాత్మ భూతేశ ♦ భూతభావనరూప
దేవ మహాదేవ ♦ దేవవంద్య
ఈలోకములకెల్ల ♦ నీశ్వరుండవు నీవ
బంధమోక్షములకు ♦ బ్రభుడవీవ
ఆర్తశరణ్యుండ ♦ వగు గురుండవు నిను
గోరి భజంతురు ♦ కుశలమతులు
సకలసృష్టి స్థితి ♦ సంహారకర్తవై
బ్రహ్మవిష్ణుశివాఖ్య ♦ బరగు దీవు
తే.గీ. పరమగుహ్యమైన ♦ బ్రహ్మంబు సదసత్త
మంబు నీవశక్తి ♦ మయుడవీవ
శబ్దయోని వీవ ♦ జగదంతరాత్మవు
నీవ ప్రాణమరయ ♦ నిఖిలమునకు. భాగవతము. పాల
కడలిద్రచ్చుట.

సీ. అట్టిట్టి దనరాని ♦ దై మొదలై నిండు
కొన్న దై వెలుగుచు ♦ గుణములేని

దై యొక్కచందము ♦ దై కల దై నిర్వి
శేషమై క్రియలేక ♦ చెప్పరాని
దిదిరూపమని శ్రుతు ♦ లెప్పుడు నొడివెడి నారూప
మగుచు స ♦ ర్వాత్మ దీప
మై బ్రహ్మ రెండన ♦ యర్థంబు తుది జగం
బులు నశియింపగ ♦ భూతగణము

తే.గీ. సూక్ష్మ భూత మందు ♦ జొరగ నాభూతంబు
ప్రకృతిలోన జొరగి ♦ ప్రకృతి వోయి
వ్యక్త మందు జొరగ ♦ వ్యక్తమడంగును
శేషసామ్య నీవు ♦ చెలువమగుదు. భా. దశమస్కంధము దేవకీదేవి స్వామిని స్తుతియించుట.

శ్లో॥ సర్వేంద్రియగుణాభాసం । సర్వేంద్రియ వివర్జితం
అసక్తం సర్వభృచ్చైవ । నిర్గుణం గుణభోక్తృచ॥

తా. మరియు నది సర్వేంద్రియ వ్యాపారములచే విరాజిల్లు చటులుండినను సర్వేంద్రియ వివర్జితంబైనది యెందున నంటకుండినదియైనను దేహాది సకల ప్రపంచమును భరించుచుండునది సత్వరజస్తమోగుణములు లేనిదైనను ఆగుణములు అనుభవించునట్లు తోచుచుండు నది. భగవద్గీత క్షేత్రజ్ఞవిభాగయోగము.

ఇట్టిమహానుభావుని వేదవేదాంతవేద్యుని నిర్గుణుని నిర్మలుని స్వయంప్రకాశుని సర్వవ్యాపుని సృష్టిస్థితిలయకారణహేతుభూతుని కార్యకారణహేతుభూతుని చిత్స్వరూపుని జ్ఞానానందమయుని విశ్వంభరుని విశ్వాకారుని విశ్వగర్భుని యోగిహృద్ధ్యానగమ్యుని సత్యస్వరూపుని నిత్యస్వరూపుని ఆనందస్వరూపుని ధర్మస్వరూపుని అమృతస్వరూపుని అక్షరుని ప్రశాంతుని ప్రబోధుని అవ్యయుని శుద్ధసత్వుని కర్తయు భోక్తయు ద్రష్టయు నుతముడై దనరు వానిని సాక్షిభూతుని అభేద్యుని అలింగుని సహస్రశీర్షుని పురుషుని దేవాదిదేవుని ఆదిమధ్యాంతరహితుని అనంతుని మాసబుత్వయనాబ్దంబులుధరించిన

పద్మని జన్మమృత్యుజరావ్యాధిశోకంబులను భీతిని హరించువానిని నిరుపమానుని సర్వశక్తుని ఘటనాఘటనసమర్థుని అణోరణీయుని మహతోమహీయుని నిరాధారుని అఖిలజగదాధారుని సర్వసముని సర్వజన్మస్థానుని ఓంకారశబ్దవాచ్యుని పరబ్రహ్మను పరమాత్ముని అట్టిట్టిదనరానిదైన వస్తువును అపరాధీనుని అంతర్జ్యోతునిఅసమానుని అచ్యుతుని గోవిందుని సర్వభూతనివాసుని ప్రధానుని పరమపురుషుని పరంధాముని మహాదేవుని దేవాదిదేవుని స్త్రీపుంసాదిలక్షణశూన్యుని అఖిలజగన్నాథుని సర్వేశ్వరుని సప్తస్వరములు నిమిడియుండెడునాదమునకుఆధారుడై నిరాధారమననుండువానిని తేజోరూపుని భక్తానుగ్రహవిగ్రహుని జగంబులకుప్రసవభూమియగువానిని కరిని గాచినస్వామిని ప్రహ్లాదునిబ్రోచినప్రభువును రాతినినాతిగాజేసినరాజును ద్రౌపదిమానముగాచినదొరను వివిధవిచిత్రానంతభోగ్యభోక్తృవర్గభోగోపకరణభోగస్థానరూపుని అనవరతవిదితనిఖిలభూతజాతయాథాత్మ్యుని సత్యకాముని సత్యసంకల్పుని నిఖిలనియమననిరతుని అఖిలజగత్స్వామిని సకలేతరసంస్తవస్తువిలక్షణుని దివ్యాద్భుతనిత్యనిరవద్యనిశతిరయౌజ్జ్వల్య సౌందర్య సౌగంధ్య సౌకుమార్యలావణ్యయౌవనాద్యనంతగుణనిధిదివ్యరూపుని ఆపత్సఖుని కాకుత్స్థుని ఆశ్రితవాత్సల్యైకజలధిని శ్రీమన్నారాయణుని నేసేవింతుఁ. మరియు శ్రీమన్నారాయణుని చరణారవిందంబులలో ఒకపాదంబునభువియు మరియొకపాదంబునదివియు నావరించినపాదయుగళంబునకు నేజోహారొనర్తు అహల్యాశాపవిమోచనమొనరించినపాదంబులకు నేనమస్కరింతు శకటాసురుని కాలతన్నిన పాదంబులకునేదండమిడుదు కాళియునిఫణములమీదనటనమొనర్చిన పాదంబులకునేసేవింతుఁ. జీవకోటికిపావనత్వంబిచ్చుగంగోద్భవకారణంబైనపాదంబులనునేశిరసావహింతు ఏవంభూతభూమీనీళానాయక స్వచ్ఛందానువృత్తిస్వరూపస్థితిప్రవృత్తిభేదాశేషశేషతైకరతిరూప నిత్యనిరవద్యనిరతిశయ జ్ఞానశక్త్యైశ్వర్యాద్యనంతకల్యాణగుణగణ శేషశేషాశనగరుడప్రముఖ

నానావిధానంతపరిజనపరిచారికాపరిచరితచరణయుగళంబులకు నేదండప్రణామంబు లొనర్తు.

శ్లో॥ త్వమేవమాతాచపితాత్వమేవ। త్వమేవబంధుశ్చ గురుస్త్వమేవ
త్వమేవవిద్యాద్రవిణంత్వమేవ । త్వమేవ సర్వం మమదేవదేవ॥

మనోవాక్కాయై రనాదికాలప్రవృత్తానంతా కృత్యకరణ కృత్యాకరణ భగవదపచార భాగవతాపచార సహ్యాపచార రూప నానావిధానంతాపచారా నారబ్ధకార్యాన్ కృతాన్ క్రియమాణాన్ కరిష్యమాణాంశ్చ సర్వానశేషతఃక్షమస్వ.



## 2. భగవంతుని గుణ స్వభావమును గురించి.



ముఖ్యమైన యంశము సృష్టి స్థితి లయములు సకలచేతనోద్ధారణ:—

మరియు స్వాభావికానవధికాతిశయ జ్ఞాన బలైశ్వర్య వీర్య శక్తి తేజస్సౌశీల్యవాత్సల్యమార్దవార్జవ సౌహార్ద్రసామ్యకారుణ్యమాధుర్యగాంభీర్యౌదార్య చాతుర్య స్థైర్య ధైర్య శౌర్య పరాక్రమ సత్యకామ సత్యసంకల్ప కృతిత్వ కృతజ్ఞ తాద్యసంఖ్యేయ కల్యాణగుణగణమహార్ణవ పరమయోగివాఙ్మన సాపరిచ్ఛేద్యస్వరూప స్వభావ నమస్తేనమస్తేనమః. గద్యత్రయంలో నంశము.

శ్లో॥ వశీవదాన్యోగుణవాన్ఋజుశ్శుచి । మృదుర్దయాళుర్మధుర
స్థిరస్సమః । కృతీకృతజ్ఞస్త్వమసిస్వభావత స్సమస్తకళ్యాణగుణామృతోదధిః॥ ఆళ్వందారు స్తోత్రం.

శ్లో॥ నిషాదానాంనేతా కపికులపతిఃకాపిశబరీ। కుచేలః కుబ్జాసావ్రజ
యువతయో మాల్యకృదితి । అమీషాంనిమ్నత్వం వృషగిరిపతే
రున్నతిమపి । ప్రభూతైస్స్రోతోభిః ప్రసభ మనుకంపేనమయసి॥

తాత్పర్యము:—జ్ఞానులయందు అజ్ఞానులయందుకూడ భగవంతుని దయ సమానముయ్యే వున్నది.

క. జగములకెల్ల శరణ్యుం
డగుచు నమృతసిక్తమైన ♦ యట్టి మనసుతో
విగతాఖిలలేపస్థితి
గగనము నట్లుండు సతము ♦ గణనాథుడే.

1. కరుణాసముద్రుడు శరణాగతవత్సలబిరుదాంకుడు నిత్యానందము నిచ్చువాడు శుభకరుడు భక్తులవెంటనుండువాడు ఒకేసమయమున అనేక పనులు చేయువాడు. యిందుకు దృష్టాంతరములు అనేకములుగలవు. కొన్ని వక్కాణించెద చందనతరువువంటివాడు అనగా చందనతరువును ఛేదించుచుండినను ఛేదించేవానికి సువాసన యిచ్చుచున్నది. మరియు పొగడ పుష్పమువంటివాడు. పుష్పమువాడినను వాడకున్నను సువాసనయే కలది. భగవంతునికి ఆగ్రహము వచ్చినను దయ వచ్చినను మోక్షము నిచ్చును. కాన భగవంతునికి సర్వజీవులకు నిత్యానందమును యిచ్చుట యందే యిచ్ఛ అయివున్నది.

2. సంగీతముపాడువాడు పాడుచు తానానందపడుచు యితరుల నానందమగ్నులనుగాచేయుచు యెట్లుండునో అట్టుల ఒకేసమయము నందు భగవంతుడు తన్ను ఆర్తిగా యేభక్తుడు పిలుచునోఅని యోగదృష్టినిజూచుచువారలకు ఆనందస్వరూపుడై ఆనందమును కలుగచేయుచు జగత్తునునడుపుచు ఉండును. స్థూలారుంధతిన్యాయముచేత నిరుపమానునికి ఉపమానము చెప్పవలసివచ్చెను.

3. పై సంగతులకు పురాణ దృష్టాంతరములు.

(a) భీష్మాచార్యులవారి విషయము.

క. శరతల్పగుడగు సతడే
శరణంబుగ నాశ్రయించి ♦ సద్భావ వ్యా
ప్తిరతుండగుటను వినుత
త్వరత నతనియందు నాదు ♦ భావంబెలసెన్.

అని శ్రీకృష్ణభగవానులు చెప్పినారు. భీష్మాచార్యులవారి మనోదార్ఢ్యతకు నిబ్బరమునకు భక్తికి యుద్ధమందు అస్త్రశస్త్ర నిపుణతకు నేను వేరే వ్రాయనవసరములేదు. జగమెరిగిన బ్రాహ్మణునకు జందెమేల అనునట్లు.

[భక్తజనరక్షణ విషయమయిన]

(b) ప్రహ్లాదులవారి చరిత్ర.

మ. హరి సర్వాకృతులం గలండనుచు ప్ర♦హ్లాదుండు భాషింప న
త్వరుడై యెందును లేడు లేడని సుతుం♦ దైత్యుండు తర్జింప శ్రీ
నరసింహాకృతినుండె నచ్యుతుఁడు నా♦నాజంగమస్థావరో
త్కరగర్భంబుల సన్నివేశముల ను♦ద్దండ ప్రభావంబునన్.

ఇట్లుండి నరసింహాకృతినిబూని ఉక్కుస్తంభమునందావిర్భవించి హిరణ్యాకశ్యపుని సంహరించి ప్రహ్లాదుని రక్షించిరి.

(c) గజేంద్రుని విషయము.

మ. సిరికింజెప్పఁడు శంఖచక్రయుగముం♦ జేదోయి సంధింపఁడే
పరివారంబునుజీర డభ్రగపతిం♦ బన్నింప డాకర్ణికాం
తర ధమ్మిల్లము జక్కనొత్తఁడు వివా♦ దప్రోద్ధత శ్రీకుచో
పరిచేలాంచలమైన వీడఁడు గజ♦ ప్రాణావనోత్సాహియై.

గాన భగవంతుని కరుణాసాహసముల నెంచ నలవిగాదు. ఇట్లపారమైన ప్రీతితో వేంచేసి మొసలినిదుంచి గజేంద్రుని రక్షించె.

(d) ద్రౌపది విషయము.

చ. ఇది యుచితంబుగాదనక ♦ యిక్కురుముఖ్యులు చూచుచుండ దు
ర్మదుడయి వీడు నన్ను నవ♦మానిత జేసెను సర్వధర్మ సం
విదులననున్న యీభరత ♦ వీరుల వంశము నేఁడధర్మ సం
పద నతి నింద్యమయ్యె నని ♦ భామిని కృష్ణు దలంచె భీతయై.

సభాపర్వములో ప్రాతిగామి ద్రౌపదిని సభకు తోడ్కొని వచ్చుటలో

ఇట్లు దలంచిన ద్రౌపదికి అక్షయ మగు వలువలొసంగి రక్షించె.

శ్లో॥ గోవిందేతి యదాక్రందత్ | కృష్ణా మాందూరవాసినం
ఋణం ప్రవృద్ధ మివ మే| హృదయాన్నాపసర్పతి॥ (ఔదార్యం)

ఉ. ఎందును నెవ్వరుంబడని ♦ యెంతయు గష్టపుపాటు వచ్చి నం
గొందలమంది పాండువిభు ♦ కోడలు దవ్వులనున్న నన్ను గో
విందుడ కావుమంచు బల ♦ వించుట యాగగ రాసియప్పుడో
లెందలబోయు వ్రేగయి చ♦లింపక యున్నది యెప్పుడుఁ మదిఁ.
(భారతం ఉద్యో.)

సీ. సేమంబు నీ క్రింద ♦ సేనమహారాజ
వెరువకు మేలు నీ ♦ వితరణంబు
వేలుపు లందుండ ♦ వేడుకపడుదురు
దుఃఖంబు లిడుములు ♦ దుర్మరణము
లాతురతలు నొప్ప ♦ లందుండు వారికి
నొందవు సుతుతలమం♦దుండు నీవు
నీ పంపుసేయుని ♦ నిర్జరా రాతుల
నా చక్రమే తెంచి ♦ నరుకు చుండు

తే.గీ. లోకపాలకులకు ♦ లోనుగా నొక్కఁడు
నన్యు లెంతవార ♦ లచట నిన్ను
నెల్లప్రొద్దువచ్చి ♦ యేనురక్షించెద
గరుణతోడ నీకు ♦ గానవత్తు. భాగవతం బలిచక్రవర్తి
విషయము. అని చెప్పి యింద్రసేనుని రక్షించెను.

ఆ.వె. నాకు మేలు గోరు ♦ నాభక్తు డగువాడు
భక్తజనులకేను ♦ పరమగతియు
భక్తుడెందు జనిన ♦ బరతెంతు వెనువెంట
గోవువెంట దగులు ♦ కోడె భంగి. భాగవతం అంబరీషో
పాఖ్యానము.

చ. చలమున బుద్ధిమంతులగు ♦ సాధులు నాహృదయంబు లీల దొం
గిలి గొనిపోవుచుందు దుర ♦ కిల్బిషభక్తిలతాచయంబులన్
నిలువగ బట్టి కొట్టుదురు ♦ నేరుపుతో మదకుంభి కైవడిన్
వలలకు జిక్కి భక్తజన ♦ వత్సలతం జనుచుందు తాపసా. అంబ
రీషోపాఖ్యానము.

గీ. తనువు మనువు విడచి ♦ తనయుల చుట్టాల
నాలి విడచి సంప ♦ దాళి విడచి
నన్నె కాని యన్య ♦ మెన్నడు నెరుగని
వారి విడువ నెట్టి ♦ వారినైన. భాగవతము అంబరీషో.

క. సాధుల హృదయము నాయది
సాధుల హృదయంబు నేను ♦ జగములనెల్లన్
సాధుల నేనని యెరుగుదు
సాధు లెరుంగుదురు నాదు ♦ చందము విప్రా. అని భగ
వంతుడు చెప్పెను. భాగవతము అంబరీషోపాఖ్యానము.

సీ. యోగీశ రూపుడై ♦ యోగంబు జూపుచు
మౌనిరూపమున గ ♦ ర్మంబు దాల్చు
సర్గంబు సేయు ప్ర ♦ జాపతి రూపుడై
యిందుడై దైత్యుల ♦ నేపడంచు
జ్ఞానంబు నెరిగించు ♦ జతుర సిద్ధాకృతి
గాల రూపమున బా ♦ కంబు సేయు
నానావిధాకార ♦ నామరూపంబుల
గర్మలోచనులకు ♦ గానబడడు

తే.గీ. చనిన రూపములను ♦ జనురూపముల నింక
జనగ నున్న రూప ♦ చయము నతడు
వివిధుడై యనేక ♦ వృత్తి వెలుంగును
విష్ణుడవ్యయుండు♦విమల చరిత. భాగ॥ 8 స్కంధము.

## 3. భగవన్నామమాహాత్మ్యము.

భాగవతం 6 స్కంధము. అజామిళోపాఖ్యానము.

సీ. నరనాథ వినుము క ♦ న్యాకుబ్జ పురమున
గలఁడు బ్రాహ్మణుఁ డజా ♦ మిళుఁ డనఁగ
పాతకుండతుల ని ♦ ర్భాగ్యుండు నష్టుండు
శిష్టసదాచారి ♦ కష్టరతుఁడు
జూదంబు లందు దు ♦ ర్వాదంబులందును
చౌర్యంబునందు మ ♦ చ్చరము గలిగి
తాఁ త్యక్తాత్మపత్నిగా ♦ మత్తుఁడై వరియించి
కొడుకుల పదుగుర ♦ బడసి చాల
తే.గీ. మోహ జలధిలోన ♦ మునిగి యుచ్చట దీర
బాలలాలనాది ♦ లీల దగిలి
పెద్ద కాల మతఁడు ♦ పెంపార సుఖియించి
ఫలిత మెల్లవదలి ♦ పతితుఁడయ్యె.

గీ. ఎనయ నతని కెనుబ ♦ దేనిమిది వర్షంబు
లంత నరుగుటయును ♦ భ్రాంతుఁ డగుచు
గోరి పిన్న కొడుకు ♦ నారాయణాఖ్యుండు
బాలుడగుట మిగుల ♦ భక్తి జేసి.

క. తనసతియు దాను గూరిమి
మనమున బెనగంగ నక్కు ♦ మారుని ననిశం
బును ముద్దు సేయుచుండెను
జనవర వాత్సల్య మాత్మ ♦ సందడి గొనగన్.

గీ. తెలియ కీ రీతి నతఁడు వ ♦ ర్తించుచుండ
భయద మగుమృత్యు కాలంబు ♦ ప్రాప్తమయిన
భూరివాత్సల్యవృత్తి న ♦ వ్వుతుఁ దలచి
యాత్మ బ్రలపించె నారాయ ♦ ణా యటంచు.

అప్పుడు

క. శంకరుల ధర్మరాజ వ
శంకరుల దురంత దురిత ♦ సమధిక జననా
శంకరుల సకలలోక భ
యంకరులం గనియె నింద్రి ♦ యాంకులు డగుచున్.

మ. కనియెం బ్రాహ్మణు డంత్యకాలమున వీ♦క్షారోషనిష్ఠ్యూతలన్
ఘనపీనోష్ఠవికారవక్త్రవిలస ♦ ద్గర్వోత్కటోపేతలన్
జనసంత్రాసకరోద్యతాయసను పా ♦ శశ్రేణికాహాతలన్
హసనవ్యాప్తి విభీతలన్ మువుర నా ♦ త్మానేతలన్ దూతలన్.

వ. ఇట్లతివికృతతుండ గండాభోగవిభాగవిషమ వివృత్తనేత్రులు నతిపుష్ట నిష్ఠురతనుయష్టి సంవేష్టిత మహోర్ధ్వరోములు, నభ్యస్తసమస్త జీవాపహరణకరణ పరిశస్తహస్త విన్యస్తపాశధారులు, నగు యమభటుల మువ్వురం గనుంగొని యజామిళుండు వికలేంద్రియుండును వికంపితప్రాణుండును వికృతలోచనుండును విహ్వలాత్ముండును నై.

క. దూరమున నాడు బాలుడు
భోరున తన చిత్తసీమ ♦ బాపగట్టిన నో
నారాయణ! నారాయణ!
నారాయణ! యనుచు నాత్మ ♦ నందను నొడివెన్.

చ. మరణపువేళ నద్దనుజ ♦ మర్దను సంస్మరణంబు సేయ ద
త్పరిసరవర్తు లాత్మపరి ♦ పాలకు నామము నాలకించి ని
ష్ఠురగతి నేగుదెంచి పొడ ♦ జూచి యదల్చిరి కాలుదాసులన్
ఘనతరభాషులన్ వికట ♦ కల్పితవేషుల దీర్ఘఘోషులన్.

క. దాసీభర్తనజామిళు
భూసురు దత్తనువువలన ♦ భోరున వెలికిం
దీసు యమభటులబోలన్
డోసిలి శ్రీవరుని కూర్మి ♦ దూతలు కడిమిన్.

వ. ఇట్లు విష్ణుదూతలవలన నిర్ధూతప్రయత్నులై యమదూతలిట్లనిరి.

ఉ. బంధుగులట్టి సజ్జనుల ♦ బాధలబెట్టి యనాథకోటిచేఁ
బందెలుసుట్టి యీరములు ♦ పట్టి పథంబులుగొట్టి దిట్టయై
నిందలకోర్చి సాధులకు ♦ నిందితుడై గడియించువిత్తమా
సుందరికిచ్చి మచ్చికలు ♦ సొంపెనగూర్చి వసించె దత్కృపన్.

క. అటుగాన పాపకర్ముని
గుటిలుని సుజనార్తుఁ ధూర్తుఁ ♦ గ్రూరుని నేమా
రటమున గొని యేగెద మం
తట దండమువలన నితడు ♦ ధన్యత నొందున్.

వ. ఇట్లు పలుకుచున్న యమదూతలవారించి నయకోవిదులైన భగవద్దూతలిట్లనిరి.

క. కెందంబు బుత్రువలనన్
జెందినదని తలపవలదు ♦ శ్రీపతిపేరే
చందమునన్నె నబలికిన
నందకధరుడందె గలడు ♦ నాథుండగుచున్.

గీ. బిడ్డపేరుబెట్టి ♦ పిలుచుటవిశ్రామ
కేలినైన మిగుల ♦ గేలినైన
బద్య గద్య గీత ♦ భావార్థములనైన
గమలనయను దలప ♦ గలుషహరము.

మ. నిరతంబై నిరవద్యమై నిఖిలభి ♦ న్నిర్మాణమై నిత్యమై
నిరహంకారగుణాఢ్యమై నియమమై ♦ నిర్దోషమైనట్టి శ్రీ
హరి నామస్మరణామృతం బితడు ప్ర ♦ త్యక్షంబు సేవించె దా
మరణాంతంబున నిట్టి సజ్జనుని ధ ♦ ర్మంబేల వ్యర్థంబగున్.

వ. అని యిట్లు భగవద్దూతలు భాగవత ధర్మంబు నిర్ణయించి బ్రాహ్మణుని నతిఘోరంబైన మృత్యుపాశబంధజనితభీతిచే ముక్తుం

గావించి రంత నాయమదూత లాభగవద్దూతల సంభాషణ ప్రభావం బుల దమ మనంబుల శాంతినొంది భగవత్తత్వజిజ్ఞాసితులై చేయునది లేక సిరాకృతులై యమలోకంబునకుం జని పితృపతికి సర్వంబును నెఱింగించిన నతండిట్లనియె. దండధరుండు పుండరీకాక్షుని చరణ కమలంబులు దనమనంబున సన్నిహితంబుగ జేసి వందనం బాచ రించి పరమభక్తిపరుండై వారలకిట్లనియె. కలడు మదన్యుండు ఘను డొక్కడని చెప్పి భగవంతుని వృత్తాంతంబులు కొన్ని వక్కాణించి చెప్పి మఱియు నిట్లనియె.

క. ఆదిగాన విష్ణుభక్తుల
గదియుగ జనవలదు మీరు ♦ కరివరదు లస
త్పదపద్మ విసతివిముఖుల
మదినంటం గట్టి తెండు ♦ ధూర్తులు వారల్.

సీ. ఏకసక్కమునకైన ♦ నిందిరారమణుని
బలుకంగలేని దు ♦ ర్భాషితులను
గలలోననైన శ్రీ ♦ కాంతుని సత్పాద
కమలముల్ సూడని ♦ కర్మరతుల
సవ్వచునైన కృ ♦ ష్ణ ప్రశంసకు జెవి
దాలవేయని దుష్క ♦ థాభిరతుల
యాత్రోత్సవంబుల ♦ నైన నీశునిగుడి
త్రోవ ద్రొక్కగ లేని ♦ దుష్పదులను

తే.గీ. బరమభాగవతుల ♦ పాదధూళి సమస్త
తీర్థసారమనుచు ♦ దెలియలేని
వారివారి వారి ♦ వారి జేరిన వారి
దోలుత కట్టితెండు ♦ దూతలార.

వ. అని పలికెనని చెప్పి మరియు శుకుండిట్లనియె. శ్రీకృష్ణ నామసంకీర్తనంబు జగన్మంగళమనియు జగన్మోహనంబనియు జగద్గే గీయమానంబనియును నిఖిలపాపైక నిష్కృతి యనియును నిఖిల

దుఃఖనివారణంబనియును నిఖిలదారిద్ర్యనిర్మూలకం బనియును నఖిల మాయాగుణవిచ్ఛేదకం బనియును సద్ధామంబులగు హరివీర్యంబుల నాకర్ణించువారల చిత్తంబు లతినిర్మలంబులగుభంగిదక్కిన వ్రతాచర ణంబులంగావనియును శ్రీకృష్ణపదపద్మంబులు హృత్పద్మంబుల తలచు వారలన్యపాపకర్మంబులగు నవిద్యావ్యసనంబులం బొరయనేరరని యును నిజస్వామియైన యమధర్మరాజుచేత గీర్తింపంబడిన భగవ న్మాహాత్మ్యంబు నాకర్ణించి విస్మితులై కాలకింకరులు నాటనుండి యు వైష్ణవజనంబులదేరి జూడ వెఱతురు. నరేంద్రా! పరమగుహ్యం బగు నీయితిహాసంబును బూర్వకాలంబున సకలవిజ్ఞానగోచరుండైన కుంభసంభవుండు సకల దుఃఖవిలయంబును సకలపుణ్యనిలయంబైన మలయంబున పురాణపురుషుండైన పురుషోత్తము నారాధనంబు సేయుచుండి నాకెరిగించెనని చెప్పిన విని విస్మయానందహృదయుడై పరీక్షిజ్జనపాలుం డిట్లనియె.

మరియు వరాహపురాణము కైశికోపాఖ్యానము. ౮౬ అధ్యాయము.

ఒకానొక చండాలకులజుడగు భగవద్దాసుడు కార్తీక శుద్ధ ఏకాదశి రాత్రి భగవంతుని గానముచేయు నిమిత్తము వెళ్లుచుండగా నొక బ్రహ్మరక్షస్సు మార్గమున నెదురై "నాకు పదిదినముల నుండి యాహారము లేదు నిన్ను నాకు బ్రహ్మ ఆహారార్థము కల్పిం చెను. గాన భక్షించెదను." అని చెప్పగా ఈ చండాలకులజుడగు దాసుడు నావ్రతము పూర్తిచేసికొని తిరిగి వచ్చెదను. అప్పుడు నీవు భక్షించుమనిన తిరిగి వచ్చువారు గలరాయని యా బ్రహ్మరక్షస్స నగా నానిత్యదాసుడు యీక్రింది ప్రమాణవచనములను పలుకగా

శ్లో॥ గురుపత్నీం రాజపత్నీం యేతు గచ్ఛన్తి మోహితాః ।
తేషాంగతిం ప్రపద్యేవై యద్యహం నాగమేపునః॥

తా॥ అయ్యా నేను తిరిగి మీవద్దకు రానియెడల మోహ ముచే గురుపత్నిని రాజపత్నిని పొందినవాని దుర్గతిని పొందుదును.

శ్లో॥ గోకులస్య తృషార్తస్య జలార్థం అభిధావతః ।
విఘ్నమాచరతేయస్తు తత్పాపంస్యాదనాగమే॥

తా. అయ్యా నేను తిరిగిరాని యెడల నీరుదాగబోవు గోవు లనడ్డగించిన వాని పాపమును పొందుదును.

శ్లో॥ నారాయణమథాన్యైస్తుదేవై స్తుల్యంకరోతియః ।
తస్యపాపేనలిప్యేయం యద్యహంనాగమేపునః॥

తా. నేను తిరిగి రానియెడల శ్రీమన్నారాయణుని యితర దేవతలతో తుల్యుడని జెప్పువాడు పొందెడి పాపమును నేను పొందెదనని పలికిన విని యాబ్రహ్మరక్షస్సుకు సంతోషము కలిగి వెళ్ళ నమ్మనగా నద్దాసుండు యథాప్రకారము సద్దివ్యదేశంబునకుం జని ప్రభాతపర్యంతముజాగరణముచేసి తిరిగి బ్రహ్మరక్షస్సువద్దకు వచ్చు చుండగా మధ్యమార్గమున నొక మహాపురుషుడెదురుపడి నీవె క్కడికేగుచుంటివని యడుగగా నేను బ్రహ్మరక్షస్సు నొద్దకేగుచుం టిననిపై వృత్తాంతము నంతయు వినిపింపగా అయ్యది నిన్ను భక్షిం చును గాన నీమార్గము విడువవలశినదని చెప్పగా సత్యమును విడువ ననిజెప్పి బ్రహ్మరక్షస్సును చేరి "స్వామీ వ్రతము పూర్తియైనది. నాశరీరమును భక్షించమనగా నాతని సత్యసంధత్వమున కాశ్చర్య మొంది బ్రహ్మరక్షస్సు" నీకు ప్రాణములయందాశయున్న యెడల రాత్రి నీవొనర్చిన గానఫలము నాకు ధారవోయు మనగా అట్లిచ్చు వాడఁగానని జెప్పి నంతట బ్రహ్మరక్షస్సు ఒక జామొనర్చిన గాన ఫలమివ్వుమని కోరగా నన్ను భక్షించవలసినదేగాని యీఫలమివ్వ నన తిరిగి బ్రహ్మరక్షస్సు ఒక గీత ఫలమైనను నాకు దయచేసి యీ బ్రహ్మరక్షస్త్వమును వదలించవలశినదని ప్రార్థించగా దయాళుండై యట్లిచ్చి బ్రహ్మరక్షస్త్వమునుండి విముక్తునిగాఁజేసి తానును నన్ను జేరెనని శ్రీధరణీదేవితో వరాహుండానతిచ్చె.

మఱియు బ్రహ్మాండ పురాణమునం దుపోద్ఘాతపాదములో పరశురాములకు అగస్త్యులు కృష్ణప్రేమామృత స్తోత్రముపదేశించుటలో రెండు మృగములు విని ముక్తికెందెను. మరియు.

శ్లో॥ వనేచరామః వసుచాహరామః। నదీస్తరామః నభయంస్మరామః। ఇతీరయంతో విపినేకిరాతాః। ముక్తింగతాః రామపదానుషంగాత్॥

ఇక్కడ పదములచివరను రామ అను రెండు అక్షరములు గల పదములను వుచ్చరించుటచేతనే కిరాతులకు ముక్తి లభించినది.

క. హరి నెరుగని యాబాలుడు
హరి భక్తులతోడ గూడి ♦ హరి యనువాడు
న్సరియై దోషములడచును
గరువలితో నగ్ని తృణము ♦ గాల్చిన భంగిణ.

ఉ. ఆరయ వీర్యవంతమగు ♦ నౌషధమెట్లు యదృచ్ఛగొన్న ద
చ్చారుగుణంబు రోగముల ♦ చయ్యనబాపెడుమాడ్కి పుణ్యవి
స్ఫారుని నంబుజోదరుని ♦ బామరు డజ్ఞనవజ్ఞ బల్కిన
న్వారక దత్ప్రభావము ధృ ♦ వంబున నాత్మగుణంబు జూపదే.

మరియు ఆపత్కాలమందు ద్రౌపదిని రక్షించినది భగవన్నామమే అయ్యున్నది.

---

## 4. ప్రకృతి స్వరూపము.

---

భాగవతము. తృతీయ స్కంధము.

క. క్రమమున ద్రిగుణము నవ్య
క్తము నిత్యము సదసదాత్మ ♦ కము మఱియు బ్రధా
నమునగా బ్రకృతి విశే
షములవియు విశిష్టమనిరి ♦ సద్విదులెలమిణ.

వ. అందు బ్రకృతి చతుర్వింశతితత్వాత్మకంబై యుండు. పృథివ్యాపస్తేజోవాయురాకాశములును పంచభూతములును తన్మాత్రలు అనగా శబ్దస్పర్శరూపరస గంధంబులును త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణంబులును వాక్పాణిపాదపాయూపస్థలను దశేంద్రియంబులును మనోబుద్ధిచిత్తాహంకారములను నంతఃకరణచతుష్టయంబు, ననుచతుర్వింశతితత్వములనం బడునది. పకృతి. భాగవతము.



## 5. జీవాత్మ స్వరూప నిరూపణము.



క. జ్ఞానాజ్ఞానంబులకుఁ
దానయుపాశ్రయము బుద్ధి ♦ తత్వాహంకా
రానూన లక్షణాఢ్యం
బైన యెరుక దాని జీవుడని చెప్పు ♦ శ్రుతుల్.

క. నయనముఖపాణి పాదము
లయమహితాయెందు గలిగి ♦ ఆద్యంత పరి
క్షయ వృద్ధిరహితమై ని
ర్ద్వయమగు తత్వంబున క్ష ♦ రంబంద్రు బుధుల్. భాగవతము.

క. తాత్వికములైన పురుష
స్త్రీత్వంబులులేవు పార్వ ♦ తీ! జీవునకా
తత్వమున కహంకృతి గ
ర్మిత్వమొలసి భావ్యవిధమ ♦ మెయికొనుచుండుఁ.

అనుశాసనికము॥

సీ. కరణంబు కర్మంబు ♦ కర్తయు నేర్పడి
రాజిత కారక ♦ త్రయముచేత
నఖిలంబు సంవ్యాప్త ♦ మైయుండు ఘ్రాణాదు
లును మనంబును బుద్ధి ♦ యును బ్రవసులు

కరణహేతువులంచుఁ ♦ గంధాది విషయ సం
తతియు మంతవ్యాదు ♦ ద్రవ్యములును
గర్మహేతువులగు ♦ గప్పకొనగ నాన
గానమట్లగ విన ♦ గా దలంప

తే.గీ. నిశ్చయము దగఁజేయంగ ♦ నేర్పు లేదు
కలదు జీవాత్మునకు నవి ♦ కర్తృహేతు
భూతములు వాని విషయాను ♦ భూతి కతను
దొఱగు నిష్ఠలు మోక్ష హే ♦ తువులు సుమ్ము.

వ. కరణకర్మ కర్తృకారకాత్మకుండగు జీవాత్ముండు భోక్త
అశ్వమేధపర్వము. జీవాత్మ స్వరూపనిరూపణ ప్రకారము.

## 6. జీవుని పరిమాణ విషయము.

జీవుడణుపరిమాణుడు. పిపీలికయందును ఏనుగయందును జీవుడు సమానముగనే యుండును.

## 7. త్రిగుణ స్వభావము.

గీ. సత్య శౌచదయాదులు ♦ సాత్వికములు
రమణి లోభసంగాదులు ♦ రాజసములు
అనృతహింసాపరత్వ భ ♦ యాలసత్వ
ధైర్యహాని నిద్రాదులు ♦ తామసములు. అనుశాసనికము.

## 8. సృష్టి.

సీ. హరియందునాకాశ ♦ మాకాశమున వాయు
వనిలంబువలన హు ♦ తాశనుండు

హవ్యవాహనునందు ♦ సంబువు లుదకంబు
వలన వసుంధర ♦ గలిగె ధాత్రి
వలన బహుప్రజా ♦ వళి యుద్భవంబయ్యె
నింతకు మూలమై ♦ యెసగునట్టి
నారాయణుడు చిదా ♦ నంద స్వరూపకుం
డవ్యయుండజుడు న ♦ నంతుడాఖ్య

తే.గీ. డాదిమధ్యాంత శూన్యుండ ♦ నాదినిధ ను
డతనివలనను సంభూత ♦ మైన యట్టి
సృష్టిహేతుప్రకార మిా ♦ క్షించి తెలియ
జాల రెంతటిమునులైన♦జనవరేణ్య భాగ॥ ద్వితీయము.

## 9. సృష్టి వివరము.

వ. విను మాయావిభుండైన యీశ్వరుండు దనమాయం జేసి దైవయోగంబునం బ్రాప్తంబులైన కాలజీవాదృష్ట స్వభావంబులు వివిధంబులు సేయనిశ్చయించి గైకొని యీశ్వరాధిష్టితంబైన మహత్తత్వంబువలన నగుకాలంబున గుణవ్యతికరంబును స్వభావంబున పరిణామంబును జీవాదృష్టభూతంబైన కర్మంబునజన్మంబునయ్యె రజస్సత్వంబులచే నుపబృంహితంబై వికారంబు నొందిన మహత్తత్వంబువలనం దమఃప్రధానంబై దివ్యజ్ఞానక్రియాత్మకంబునగు నహంకారంబు గలిగె నదియురూపాంతరంబు నొందుచు ద్రవ్యశక్తియైన రాజసంబు క్రియాశక్తియైన తామసంబు జ్ఞానశక్తియైన సాత్వికంబునన మూడు విధంబులయ్యె నందు భూతాదియైన తామసాహంకారంబు వలన నభంబు కలిగె నభంబునకు సూక్ష్మరూపంబు భూతదృశ్యంబునకు బోధకంబైన శబ్దగుణంబు నభంబువలన వాయువు గలిగె వాయువు నకంబరాన్వయంబున శబ్దంబు స్పర్శంబునను రెండు గుణంబులు గలిగి యుండునవి దేహంబునందుండుటంజేసి ప్రాణభూతంబై

యింద్రియ మనశ్శరీరపాటవంబైన యోజస్సహోబలంబులకు హేతువై వర్తించు వాయువువలన రూపస్పర్శశబ్దంబు లనియెడు గుణంబుల మూటితోడ దేజంబు గలిగె దేజంబువలన రసరూప స్పర్శశబ్దంబులనియెడు నాలుగు గుణంబులతోడ జలంబు గలిగె జలంబువలన గంధరసరూప స్పర్శశబ్దంబులనియెడు గుణంబు లైదింటితోడ బృథివి గలిగె. వైకారికంబైన సాత్వికాహంకారంబువలన జంద్రదైవతంబైన మనంబు గలిగె మరియు దిక్కులు వాయువు నర్కుండు ప్రచేతసుండు మిత్రుండు ప్రజాపతియు ననియెడి దశదేవతలు గలిగెను. తైజసంబైన రాజసాహంకారంబువలన దిగ్దైవతంబైన శ్రవణేంద్రియంబు వాయుదైవతంబైన త్వగింద్రియంబు సూర్యదైవతంబైన నయనేంద్రియంబు ప్రచేతోదైవతంబైన రసనేంద్రియంబు నశ్వనీదైవతంబైన ఘ్రాణేంద్రియంబు వహ్నిదైవతంబైన వాగింద్రియంబు నింద్రదైవతంబైన హస్తేంద్రియంబు నుపేంద్రదైవతంబైన పాదేంద్రియంబు మిత్రదైవతంబైన గంధేంద్రియంబు ప్రజాపతిదైవతంబైనగుహ్యేంద్రియంబులనియెడి దశేంద్రియంబులును బోధజనకాంతఃకరణైక భాగంబైన బుద్ధియు గ్రియాజనకాంతఃకరణంబైన ప్రాణంబును గలిగె. భాగవతము. ద్వితీయము.

---

## 10. స్థితి.

స్థితియన జగద్రక్షకత్వము. (భాగవతము. ఏకాదశ స్కంధము) స్వాయంభువ మనువు అబ్జగర్భునకు మ్రొక్కి యడిగిన దేమన మాకిద్ది యాచరణీయమైన కర్మము. దాని నానతిమ్మనిన నీవు నీకుమాళ్ళు యజ్ఞములు చేసి సుఖముగ నుండవసిలనది. ప్రజలను ధర్మమార్గమున నడిపించి సజ్జనులను బోషింపుమనిన స్వాయంభువు బ్రహ్మకిట్లనియె.

క. అనపుడు నతనికి నతడి
ట్లనియెఁ భవదీయమైన ♦ యానతి యెట్లు

గ్లానరించెద నాకును నా
తనయులకు వసించియుండ ♦ తగు నెలవెందుఁ.

గీ. అరయలేరు విధాత యీ ♦ యఖిలజంతు
జాలమునకెల్ల నాధార ♦ భూతమైన
ధరణి యిప్పుడు ఘనజలాం ♦ తర్ని మగ్న
మైన కతమునజోటు లే ♦ దరయ తండ్రి.

క. కావున భూమ్యుద్ధరణము
గావించు నుపాయమిపుడ ♦ గైకొని నాకుఁ
దేవా! నీవెరిగింపుము
నావుడు పద్మజుడు దన మ ♦ నంబున దలచెఁ.

మ. జలమధ్యంబున లీనమొందిన ధరా ♦ చక్రంబు నే నేర్పున
న్నిలుపఁ న్వచ్చును బూర్వమందు జగము♦ల్నిర్మించునాడాదిన
ప్పాల బుట్టించినమీాద నివ్వసుమతిఁ ♦ బుట్టించితిఁ బుత్రయం
బులలోగుర్రింకి రసాతలాంతరమునుఁ♦బొందెఁ గదాపృధ్వియుఁ.

సీ. అఖిల జగత్కల్ప ♦నాటోపమునకుఁ బా
ల్పడిన నాచేత నె ♦ బ్భంగి నిపుడు
దవిలి విశ్వంభరో ♦ ద్ధరణంబు గావింప
నగునని సర్వ భూ ♦ తాంతరాత్ము
బురుషోత్తముని నవ ♦ పుండరీకాక్షు ల
క్ష్మీశపతి దనమున ♦ స్థితుని జేసి
తలపోయుచున్న ప ♦ ద్మజు నాసికా వివ
రమ్మున యజ్ఞ వ ♦ రాహమూర్తి
తే.గీ. యర్థినంగుష్ఠమాత్ర దే ♦ హంబుతోడ
జననమంది వియత్తల ♦ స్థాయియగుచు
క్షణములోపల భూరి గ ♦ జప్రమాణ
మయ్యె నచ్చటి జనముల ♦ కద్భుతముగ.

అంత మాయామయ వరాహఘుర్ఘురారావంబు బ్రహ్మాండ కఠోర పరిస్ఫోటనంబు గావింప విని జనస్తప సత్యలోకనివాసులైన మునులు ఋగ్యజుస్సామమంత్రంబుల వినుతించిరి. యజ్ఞవరాహరూపుండైన సర్వేశ్వరుండు సత్పురుషపాలన దయాపరుండు గావున దిగ్గజేంద్రలీలావిలోలుండై సప్తసాగరంబును రొంపిగా నుక్కింపగా సముద్రుండు భుజంబులెత్తి విశీర్ణహృదయుండై యార్తునిపగిది యజ్ఞవరాహా! నను రక్షింపుమని యాక్రోశింప నిశితకరాళక్షురతీక్ష్ణంబు లయిన ఖురాగ్రంబుల జలంబులవిచ్ఛిన్నంబులు గావించి యపారంబైన రసాతలంబు ప్రవేశించి భూమిం బొడగను నవసరంబున.

క. శరనిధిలోన మహోగ్రా
మరకంటకుఁ డెదురఁ గాంచె ♦ మఖమయగాత్రున్
ఖురవిదళిత కులగోత్రున్
ధరణీ కళత్రున్ గవేష ♦ ధాత్రున్ బోత్రున్.

ఇట్లు పొడగని దైత్యుండు రోషభీషణాకారుండై

మ. గదసారించి యసహ్యవిక్రము సము ♦ గ్రస్ఫూర్తిచే వేయఁగా
నది దప్పించి వరాహమూర్తి నిజదం ♦ ష్ట్రాగ్రాహతిం ద్రుంచె బెం
పొదవం గ్రోధమదాతిరేక బలశౌ ♦ ర్యోదార విస్తార సం
పదఁ బంచాస్యము సామజేంద్రుఁ జలమొ ♦ ప్పం ద్రుంచు చందంబునన్

మ. దితిజాధీశుని నీగతిం దునిమి యు ♦ ద్వృత్తిం దదీయాంగ శో
ణితపంకాంకిత గండతుండు డగుచు ♦ న్విష్ణుండు దానొప్పె వి
స్తృత సంధ్యాంబుదధాతు చిత్రిత సము ♦ ద్దీప్తక్షమా భృద్గతిన్
క్షితి దంష్ట్రాగ్రమునన్ ధరించి జలరా ♦ శిం బాసి యేతేరఁగన్.

తే. బాలశీతాంశురేఖా వి ♦ భాసమాన
ధవళ దంష్ట్రాగ్రమున నున్న ♦ ధరణి యొప్పె
హరికి నిత్యానపాయిని ♦ యైన లక్ష్మి
నెరయఁబూసిన కస్తూరి ♦ నికర మనఁగ.

[ భాగవతము. తృతీయము. ]

## 11. ప్రళయము.



ప్రళయప్రకారంబు వినుము. రాత్రియగుటయు నవ్యక్తం బహంకృతి పురుషుబోధించిన నతండు సంహరింప మూర్తులు గాని రశ్మిజాలంబుల జరాయుజప్రభృతి సర్వభూతంబులను యేపుమాపసం గూర్మపృష్ఠంబుగాని పృథివి జలమయంబగు జలంబులోకంబులెల్లం దసమయంబుగాఁజేర్చి దన్నుం గాలాగ్ని మడయింపఁగుండియు ప్రజ్వాల జ్వాలాభీలంబగు నయ్యనలంబు అనిలంబుచేతం జెడు. నెందున దానయ్యె పరగు నమ్మహాబలునాకసంబు మిగులఁగు నతివితతంబులగు నవ్వి యత్తత్వంబు మనంబు గ్రసియించు మనంబు నయ్యహంకారాధిష్ఠిత పురుషుండుకబళించు నహంకృతి నవ్యక్తంబులోఁగాను. ఇట్లు రేయిపోయిన నెప్పటియట్లవర్తిల్లు. (భారతము. శాంతిపర్వము. యాజ్ఞవల్క్య జనకరాజ సంవాదము).



## 12. పరమపదము.



ఆ.వె. మూఁడు లోకములకు ♦ మూలమై యాంధార
భూతమై త్రికాల ♦ ముల దదభ్యు
దయమునకు నిదాన ♦ మై యొప్పు నెయ్యది
యదియ విష్ణు పరమపదము దెలియ. విష్ణుపురాణము.

గీ. ధ్యానయోగ నిశ్చయ మగు ♦ నంతరంగ
మెడల విడుచు గుణంబుల ♦ నిర్ధశాంత
మైన నిర్గుణ వస్తువు ♦ నందు గలయు
బరమపదమది దానికి ♦ బరము లేదు. శాంతిపర్వము.

శుద్ధసత్వమయమగు నట్టిదియు నిత్యముక్తులుండినట్టిది పరమపదము.



## 13. మోక్ష ప్రకారము.



జీవుడు ప్రకృతి సంబంధమును విడుచుటయే మోక్షమనబడును.

క. పునరావర్తనరహితుం
డనఘా పరమాత్ము జెందు ♦ నట్టి పురుషుడ
వ్విను తావన్మను మోక్షం
బని చెప్పందురంతకంటె ♦ నధికము గలదే. భాగవతము.

క. విను కేవలుడగు జీవుడు
తనుబరముగ్నాగ జూచి ♦ తల్లీనత్వం
బున వెలుగునది నిరామయ
మనంతమగు పదముసువ్వె ♦ యతులవివేకా.

క. సంతోషమ్మున నేగతి
శాంతాత్మునకొదవు దాని ♦ సద్గతిగా వే
దాంతవిదులు గొనియాడు దు
రింత నిజము దీని నీవు♦నెరుగు మునీంద్రా. శాంతిపర్వము.

క. సంగము బంధమఖిల ని
స్సంగత మోక్షంబు బహు వి ♦ చారములేలా
పింగజటాజూట కలిత
గంగా! బాలేందు మహిత ♦ గౌరీసహితా. అనుశాస.



## 14. న ర క ము.



దుష్కృతకర్మఫల మనుభవించుచోటు నరకము.

వ. ఘోరకర్మంబుల నొనరించి ప్రాణిహింసకు లగువారు రౌరవంబు సూకర తాలతప్తకుంభ మహాజ్వాల క్రిమిక్రిమిభక్ష విష్ఠాకర్ణ మూత్రాకర్ణ అగ్నిజ్వాల మహాఘోర స్వభోజన మొదలగు నరకంబులు యముని పట్టణ ప్రాంతంబున నుండు. (బ్రహ్మాండ

పురాణము) రౌరవము, మహారౌరవము, అంధకూపంబును, క్రిమిభోజనంబును, నావీచిరయంబును సందంశమును, దష్ట్రోర్మియు, రేతఃపానంబును, సూచీముఖంబును మొదలగు అష్టావింశతి నరకంబులు గలవు. భాగవతము 5-వ స్కంధము.

## 15. శరీరము.

గీ. మాంస శోణితాస్థి ♦ మయ శరీరంబులు
తానుగాగ నాత్మ ♦ దలచు నట్టి
కృపణ జనులు వీని ♦ కీడు గానగ లేక
చిక్కిచెడు దురంత ♦ నిక్కువంబు. అశ్వమేధ పర్వము.

క. శారీరస్థితికి ప్రథమ
కారణమై యుండు నాడి ♦ కా దశకము సం
చారికములు నింద్రియముల
కారయనాడికలు మరియు ♦ నై దమలమతీ.

గీ. స్థూలభంగులు పది మును ♦ సూక్ష్మ భంగు
లయిదు నివి వీనికంటె న ♦ త్యంత సూక్ష్మ
భంగి హృదయంబు నడుమగా ♦ బరగియున్న
నాడి యది సర్వగతయగు ♦ జూడజూడ.

క. ఆ చూపుమరగి చిత్తం
బేచవికింబోదు బోయె ♦ నేని మరలు పం
గోచరమగు వెలిచవులం
బాచిన లోచవిని నిలిచి ♦ పరమాత్మ గనుక్.

క. ఆవిధము శుక్లగతి గను
భావమునకు గాని పట్టు ♦ వడదు వినుము శు
క్లావేశము సంకల్పజ
మావాసము శుక్లమునకు ♦ నఖిలాంగకముల్.

ఆ.వె. శుక్లమునకు మనసు ♦ సూక్ష్మరూపము మనో
బలము నిల్వరింప ♦ పక్వబుద్ధి
యోపునరుణ వృద్ధు ♦ లు షపరిజ్ఞాన కా
ర్పల్యమూషవికల ♦ భావులగుట.

క. కావున శుక్లస్థితికిఁ
గావించిన యట్టి పుణ్య ♦ కర్మములకు గ
చ్ఛేనతి యమనియమాదుల
తోఁ బ్రవ సారనువలయు విషయ ♦ దూరాత్మకుఁడై.

న. వినుండు సకల జన్మంబులందును ధర్మార్థచరణ కారణంబయిన మానుషజన్మంబు దుర్లభం బందు బురుషత్వంబు దుర్గమంబదియు శతవర్షపరిమితంబయిన జీవితకాలంబున నియతమైయుండు నందు సగమంధకారబంధురంబై రాత్రి రూపంబున నిద్రాదివ్యవహారంబులనిరర్థకంబై చను దక్కిన పంచాశద్వత్సరంబులు అందును బాల్యయౌవనకౌమార కైశోరవయో విశేషంబులవింశతిహాయనంబులు గడచు కడమ ముప్పది యబ్దంబులు నింద్రియంబులచేత పట్టువడి దురవగాహంబులయిన అరిషడ్వర్గపాశంబుల గట్టువడి విడివడ సమర్థుండుగాక ప్రాణంబులకంటెను మధురాయమాణమైన తృష్ణకులోనై భృత్యతస్కరవణిక్కర్మంబులఁ బ్రాణహానియైన నంగీకరించి పరార్థంబుల నర్థించుచు రహస్య సంభోగ చాతుర్య సౌందర్య విశేషంబుల ధైర్యవల్లికాలవిత్రంబులయిన కళత్రంబులను మహనీయ మంజుల మధురాలాపంబులుగలిగి వశులయిన శిశువులను శీలవయోరూపధన్యలగు కన్యలను వినయవివేక విద్యాలంకారులైన కుమారులను గామిత ఫలప్రదాతలగు భ్రాతలను మమత్వప్రేమదైన్య జనకులగు జననీజనకులను సకల సౌజన్య సింధువులయిన బంధువులను ధనకనక వస్తువాహన సుందరంబులయిన మందిరంబులను సుకరంబులైనపశుభృత్యనికరంబులను వంశపరంపరాయత్తంబులయిన విత్తంబులను వర్జింపలేక సంసారంబు నిర్జించు నుపాయంబు గానక తంతు

వర్గంబున నిర్గమద్వారశూన్యంబైన మూవిరంబుజేరి చిక్కువడి వెడలెడి పాటవంబు సాలక తగులువడు కీటకంబు చందంబున గృహాస్థుండు స్వయంకృత కర్మబద్ధుండై శిశ్నోదరాది సుఖంబుల ప్రమత్తుండై నిజకుటుంబపోషణ పారవశ్యంబున విరక్తిమార్గంబు దెలియ నేరక స్వకీయపరకీయభిన్నాభిమానంబున నంధకారంబునం బ్రవేశించు గావున కౌమార సమయంబున మనీషాగరిష్ఠుండై పరమభాగవత ధర్మంబుననుష్ఠింపవలయు దుఃఖంబులు వాంఛితంబులుగాక చేకురు భంగి సుఖంబులును గాలానుసారంబులై లబ్ధంబులగుంగావున వృథా ప్రయాసంబున నాయుర్వ్యయంబు సేయంజనదు. హరిభజనంబున మోక్షంబు సిద్ధించు విష్ణుండు సర్వభూతంబులకు నాత్మేశ్వరుండు ప్రియుండు ముముక్షువైన దేహికి దేహావసానపర్యంతంబు నారాయణచరణారవింద సేవనంబు కర్తవ్యంబు. సప్తమస్కంధము.

## 16. శరీర లక్షణము. ఆయుర్వేదము. వైద్య గ్రంథము.

శ్లో॥ కలాస్సప్తాశయాస్సప్తధాతవస్సప్తతన్మలాః । సప్తోపధాతవస్స
ప్తత్వచస్సప్తపరికీర్తితాః॥ త్రయోదోషానవశతం స్నాయూ
నాం సంధయాస్తథా । దశాధికంచద్విశతమస్థ్నాంచ త్రిశతం
తథా॥ సప్తోత్తరం మర్మశతం సిరాస్సప్తశతంతథా । చతుర్వ్విం
శతిరాఖ్యాతా ధమన్యోరసవాహికాః॥ మాంసపేశ్యస్సమాఖ్యా
తానృణాం పంచశతంబుధైః । స్త్రీణాంచవింశత్యధికాకండరా
శ్చైవషోడశ॥ నృదేహేదశరంధ్రాణి నారీదేహేత్రయోదశ ।
ఏతత్సమాసతః ప్రోక్తం విస్తరేణాఘునోచ్యతే॥

తా. మనుజుల శరీరంబున రసాదిసప్తధాతువులకు హద్దుగ నుండెడి యేడుకళలును ఉదరంబున యేడుఆశయంబులును, రసము, రక్తము, మాంసము, మేదస్సు, మజ్జ, అస్థి శుక్లములన యేడుధాతువులును, ఆధాతువులకు యేడు మలస్థానంబులును, సప్తధాతువులకు సమీపమున నుండెడు యేడుఉపధాతువులును యేడు చర్మపొర

లును వాతపిత్తకఫంబులను మూడు దోషంబులును ౯౦౦ నరము లును ౨౧౦ ప్రధానంబులగు సంధులును శరీరంబున కాధారభూత ములై ప్రధానంబుగనుండెడు 300 యెముకలును జీవాధారంబుగ నుండెడు ౧౦౭ మర్మస్థలంబులును దోషము, ధాతువు, ఉదకము వీటిని వహించెడు ప్రధానంబులగు ౭౦౦ నాడులును రసము వహిం చెడి ౨౪ నాడులును పురుషుని శరీరంబునందు ౫౦౦ మాంసపు సం చులును స్త్రీల శరీరంబున ౫౨౦ మాంసపు సంచులును నున్నయవి. మరియు స్త్రీ పురుషులకు ౧౬ స్థూల నరంబులును గలవు. పురుష దేహంబున ౧౦ రంధ్రంబులును స్త్రీ దేహంబున ౧౩ రంధ్రంబులును నున్నయవి. వీటి వివరంబులు ఆయుర్వేద గ్రంథములయందు యిం కను విపులముగా నున్నయవి యిక్కడ నిక గ్రంథ బాహుళ్యభీతిచే వదిలి పెట్టితిమి. శార్ఙ్గధరసంహిత.



## 17. పిండోత్పత్తి ప్రకారము.



సీ. కైకొని మఱి పూర్వ ♦ కర్మాను గుణమున
శశ్వత్ప్రకాశకుం ♦ డీశ్వరుండు
ఘటకుండు గావున ♦ గ్రమ్మఱ జీవుండు
దేహసంబధంబు ♦ దివిరి తాల్ప
దారకొని పురుషరే ♦ తోబిందు సంబంధి
యై వధూగర్భంబు ♦ నందు జొచ్చి
కైకొని యొక రాత్రి ♦ గలలన్బు పంచరా
త్రముల బుద్బుదమును ♦ దశమ దివస

తే.గీ. మందు గర్కంధువై యుండు ♦ నంతమీద
పేశమగు నంతమీఁదట ♦ బేర్చి యండ
కల్పమగు నొక్క నెల మస్త ♦ కమును మాస
యుగళమై గను గర చర ♦ ణములు బొడము.

వ. మఱిమాసత్రయంబున నఖరోమాస్థిచర్మంబులు లింగఛిద్రంబులును గలిగి నాలవమాసంబున సప్తధాతువులు పంచమమాసంబున క్షుత్తృష్ణలు షష్ఠమమాసంబున మావిచేతం బొదువంబడి తల్లి కుక్షిని దక్షిణ భాగంబునం దిరుగు మాతృభుక్తాన్నపానంబుల వలన దృప్తింబొందుచు సప్తధాతువులును గలిగి జంతు సంకీర్ణంబగు విణ్మూత్రగర్భంబందు దిరుగుచు గ్రిమిభక్షితశరీరుండై మూర్ఛలం బొందుచు దల్లి భక్షించు నట్టి తిక్తోష్ణలవణక్షారామ్లాద్యుల్బణంబులైన రసంబులచేత బరితప్తాంగుండగుచు జరాయువునగప్పంబడి బహిః ప్రదేశంబునందు నాంత్రంబులచేత బద్ధుండై కుక్షియందు శిరంబు మోపుకొని భుగ్నంబైన పృష్ఠగ్రీవోదరుండై స్వాంగచలనంబునందు నసమర్థుండగుచు బంజరంబునందుండు శకుంతంబు చందంబున నుండి దైవకృతంబైన జ్ఞానంబునం బూర్వజన్మదుష్కృతంబుల దలంచుచు దీర్ఘోశ్వాసంబు జేయుచు నేసుఖలేశంబునం బొందక వర్తించు నంత నేడవనెలయందు లబ్ధజ్ఞానుండై చేష్టలు గలిగి విట్క్రిమిసోదరుండై యొక్క దిక్కున నుండక సంచరించుచు బ్రసూతిమారుతంబులచేత నతివేష్టితుండగుచు యాచమానుండు దేహాత్మదర్శియై బునర్గర్భవాసంబునకు భీతుండగుచు బంధనభూతంబగు సప్తధాతువులచే బద్ధుండై కృతాంజలిపుటుడు దీనవదనుండునై జీవుండు దానెవ్వనిచే నుదరంబున వశియింప నియమింపబడె నట్టి సర్వేశ్వరుని నిట్లని స్తుతియించు.

క. అనయమును భువన రక్షణ
మునకై స్వేచ్ఛాను రూప ♦ మున బుట్టెడి వి
ష్ణుని భయవిరహితమగు పద
వనజయుగంబర్థిఁ గొల్తు ♦ వారని భక్తిన్.

చ. పరగుచునున్న దుర్వ్యసన ♦ భాజనమై ఘనదుఃఖమూలమై
యరయగ బెక్కుతూంట్లైదు మ♦హా క్రిమిసంభవమైన యట్టి దు

స్త్రర బహు గర్భవాసముల ♦ సంగతి మాన్పుటకై భజించెద
న్సరసిజనాభ భూరిభవ ♦ సాగరతారక పాదపద్మముల్.

క. అని కృత నిశ్చయుఁడయి యే
చిన విమలజ్ఞాని యగుచు ♦ జీవుఁడు గర్భం
బున వెడలఁ నేరకుండెన్
జనియె న్నవమాసములును ♦ జననీ యంతన్.

వ. దశమమాసంబున వాని నధోముఖుంగావించిన నుచ్ఛ్వాసనిశ్వాసంబులు లేక ఘనదుఃఖభాజనుండును విగతజ్ఞానుండును రక్తదిగ్ధాంగుండై విష్ఠాంధక్రిమింబోలి నేలంబడి యేడ్చుచుండు జ్ఞానవిహీనుండై జడుంబోలియుండి యుదనిచభావానభిజ్ఞులగు పరులవలన వృద్ధి బొందుచు నభిమతార్థంబులం జెప్పనేరక యు నేక కీటసంకులంబైన పర్యంకంబునందు నశక్యానుండై యవయవంబులు కండూయమానంబులైన గోకనేరక యు స్తనోత్థానగమనంబుల నశక్తుండై తనశరీరచర్మంబు మశకమత్కుణమక్షికాదులు నొచ్చువ గ్రముఁలచే వ్యథంబడు క్రిమికుంబోలి దోధూయమానుండై రోదనంబుచేయుచు విగతజ్ఞానుండై యుండుచు శైశవంబునందత్యంతియానుభవంబు గావించి పౌగండవయస్సున దదనురూపంబులగు నధ్యయనాది దుఃఖంబులనుభవించి తదనంతరంబ యౌవనంబు ప్రాప్తంబైన నభిమతార్థఫలప్రాప్తికి సాహసపూర్వంబులగు వృథాగ్రహంబులు సేయుచు బంచమహాభూతాది [illegible]ంబగు దేహంబందు బెక్కుమారులహంకారమమకారంబులం జేయుచు దదర్థంబులైన కర్మంబులాచరింపుచు సంసారబద్ధుండగుచు దుష్పురుషసంగమంబున శిశ్నోదరపరాయణుండై వర్తింపుచు నజ్ఞానంబునంజేసి వర్ధిష్యమాణరోషుండగుచు దత్ఫలంబులగు దుఃఖంబు నుభవించుచు గాముకుండై నిజనాశంబునకు హేతువులగు కర్మంబులం బ్రవర్తింపుచుండు. తృతీయ స్కంధము.

—॰—

## 18. శరీరదోషములు.

క. విను కామము క్రోధము భయ
మును నిద్రయు నిశ్వసనము ♦ భూవర దేహం
బున గల దోషము లీవై
దును మాపెడు తెరగు చెప్పె♦దన్ తెలియుంగన్. శాంతి.

చ. వినుము జరానుబంధమున ♦ వెంట్రుకతండము బండ్లు వీనులున్
గనుగవయుంజరం బొరయు ♦ గా యొకయప్పుడు తృష్ణ జీర్ణగా
దనయము బెచ్చి ప్రాణములు ♦ సప్పక బోవనిరోగమల్ప బు
ద్ధి నరులు ద్రోవలేరది మ ♦ దిన్ జొరనీరు సుఖార్థులై బుధుల్.
భారతము.

శ్లో॥ ఇంద్రియార్థేషు వైరాగ్య మనహంకారవేవచ
జన్మమృత్యుజరావ్యాధి దుఃఖదోషానుదర్శనం॥ భగవద్గీత.

వ. మరియు వాతపిత్త శ్లేష్మంబుల వేరవేర జనించు వివిధ రోగంబులును సన్నిపాతంబునుగలుగు సత్వరజస్తమ సుస్థితివిషమతను నోవ్యాధియు సంభవించు తక్కిన శారీరకములు యినియు రెండు తెరంగులు.

## 19. శరీరదోషపరిహారములు. (ప) ఆయుర్వేద గ్రంథములు.

సీ. క్షమ క్రోధమునకు సం ♦ కల్పవర్జనము కా
మమునకు నప్రమా ♦ దంబు భయము
నకు సత్యసంసేవ ♦ నము నిద్రకును లఘు
భోజిత నిశ్వాస ♦ మునకు వైరు
లవిచెప్పి వెండియు ♦ నను ననేకములగు
దోషముల్ దొలగంగ ద్రోచు వెరవు
లను బెక్కులవి గను ♦ గొను వివేకముగల
పురుషుండు దన్మార్గ ♦ పరిచయమున

తే.గీ. విష్ణుమాయనుదోచు నీ ♦ విష్టపములు
భిత్తిచిత్రంబు విధమున ♦ ఫేనభంగి
బుద్బుదాకృతిగాగను ♦ బుధుడు వీని
సరకు సేయక మోక్షంబు ♦ దెగవు వెదకు. శాంతి.

వ. మరియు వాతపిత్త శ్లేష్మజనిత వివిధ దోషంబుల నివారణకు బ్రహ్మ ఆయుర్వేదమునిర్మించి భాస్కరున కుపదేశించె. ఆయన వలన ధన్వంతరి మొదలగువారు గ్రహించిరి. ఇప్పుడు వాడుక గ్రంథములు:—బసవరాజీయము, భారతకల్పము, శంభురాజీయము, శాంభవీకల్పము, శంకరశాస్త్రము, చరకగ్రంథము, భీమశాస్త్రము, భేషజకల్పము, రంగరాజీయము, రసరత్నాకరము, రసవాదము, రామగారుడము, రేవణసిద్ధకల్పము, నీతిశాస్త్రము, నేత్రాభరణము, నేత్రబుజసంహారము, సూర్యకల్పము, సూత్రస్థానము, సుప్రసిద్ధము, సూర్యశాస్త్రము, చంద్రకల్పము, ఇంద్రగారుడము, కాశిఖండము, గరుడరాజీయము, కర్మవిపాకము ధర్మపాకము, సింధూరమణిదర్పణము, చింతామణియును, అగ్నిమతాంతరము, అన్యశాస్త్రము, సిద్ధసారము, చికిత్సాసారసిద్ధసంగ్రహము, శారీరమును చాలుశాస్త్రము, బ్రహ్మగారుడము, వాగ్భటము, మాధవీయము, అశ్వనీకల్పము, ఆయుర్వేదము, నందినాథీయము, నాకశాస్త్రము, నిత్యనాథీయము, సత్యామృతము, పూజ్యపాదీయము, భుజంగశాస్త్రము, దేవీశాస్త్రము, దినబుతుదివ్యామృతము, వైద్యజీవనము, వైద్యకావ్యము, లోలంబరాజీయము, బాలగ్రహశాస్త్రము, అశ్వశాస్త్రము, విశ్వమూలికానామసంగ్రహము, మృగశాస్త్రము, మృత్యుంజయకల్పము, విహంగశాస్త్రము, విజయశాస్త్రము, భూధరకల్పము, భూతవిమోచనశాస్త్రము, గజశాస్త్రము, విజయజయము, సింధూరజశాస్త్రము, శమనకల్పము, అపత్యశాస్త్రము, భవరోగసంహారము, అంజనీకల్పము, అమృతధారసంగ్రహము, రాక్షసకల్పము, రాజక్రియపబంధము, ద్రవ్యభేదము, ద్రవ్యగుణము, ధనదశాస్త్రము, వినయ

కల్పము, మయూరధ్వజకల్పము, మహాశాస్త్రమునను సమస్త వైద్య శాస్త్రములుపరిశీలించి యేర్పరచిన వైద్యనాథీయము మొదలగు వైద్యశాస్త్రములం గల కషాయములు కల్కములు చూర్ణములు హోమకల్పములు మంథములు కటుకములు లేహ్యములు ఆవిరులు గండూషణములు పట్లు పొగలు కాటుకలు పట్టీలు కట్లు వస్తికర్మ ఘృతములు తైలములు రసాయనములు అరిష్టములు క్షారములు ఫాంటములు భస్మాదులు మొదలగు ఔషధసేవలవలన తద్దోషములు నివారింపం గలవు.

---

## 20. శరీరమున స్త్రీ పురుష భాగములు.

---

క. వనిత గుణంబులు చర్మం
బును మాంసము శోణితంబు ♦ పురుషగుణాస్థిక
మను మజ్జాస్థి స్నాయువు
లనఘ తపోవిభవ విఖ్య యని ♦ యారీతి చెప్పఁగ.

---

## 21. ఇంద్రియ వ్యాపార గుణ ప్రమాణములు.

---

శ్లో॥ కురంగమాతంగపతంగభృంగ మీనాహతాః పంచభిరేవ పంచ
ఏకః ప్రమాదీ సకథం నహన్యతే యస్సేవతే పంచభిరేవ పంచ

తా. కురంగము కర్ణములవల్లను, మాతంగములు త్వక్కువల్లను, పతంగములు చక్షుస్సువల్లను, భృంగము నాసికవల్లను, మత్స్యము జిహ్వావల్లను నశించుచున్నవి. ఒక్కొక్క ఇంద్రియ సేవవల్లనే యిట్టి స్థితి సంభవించెను. పంచేంద్రియ వ్యాపారులకు నెట్టిస్థితి సంభవించునో చెప్పనక్కరలేదు గదా.

చ. వనకరి జిక్కె మైనసకు ♦ వాచవికిం జెడిపోయె మీను తా
వినికి నశించె జిల్వ గను ♦ వేమరు జెందెను లేళ్ళు తావిలో

మునిగి నశించె దేటిదర ♦ మా ధర నింద్రియ పంచకంబునుం
దసమునమీద నేటికిని ♦ దాశరథీ కరుణాపయోనిధీ.

మఱియు భాగవతము ఏకాదశస్కంధములో శ్రీకృష్ణుడు యుద్ధవునకు పరమార్థోపదేశముచేయుటలో అనేక జంతువులవల్ల ననేక సంగతులు గ్రహించినట్టు వున్నది. అవి యేవనిన.

వ. అతితీవ్రంబైన మోహంబు కోరగాదు. అట్లుగాన నిరం
తరి ధ్యానపరుండయి భూమి, పవన, గగన, జలకృపీటభవసోమ సూర్యకపోతలిప్య, జలధి, శలభ, మధుక్షికాజగరద్విరేఫ హరిణపాఠీన, పింగళాకురరడింభక, కుమారికా, శరకృత్సర్వలూపేశ, కృత్స్నల, సముదయంబునుండి వానిగుణంబు లెఱింగికొని యోగీంద్రులు మెలంగుదురనిన.

క. ఇవి తెలియనలయు నాకును
బ్రవిమలమతి వీని దెలియ ♦ బలుకు మనంగన్
గ్రమమున వినుమని కృష్ణుడు
సవినయుడగు నుద్ధవునకు ♦ చయ్యన జెప్పెన్.

వ. ఇవ్విధంబున భూమివలన సైరణయుగంధవహునివలన బంధురంబగు పరోపకారంబును విష్ణుపదంబువలన గాలసృష్టిగుణసాంగత్యంబును ఉదకంబువలన నిత్యశుచిత్వంబు నగ్నివలన నిర్మలత్వంబును నిశాకరప్రభాకరులవలన నధికాల్పసమత్వ జీవగ్రహణమోక్షంబును గపోతంబువలన గళత్రపుత్రస్నేహంబు నజగరంబువలన స్వేచ్ఛాసమాగతాహారంబును వననిధివలన నుత్సాహాశోషణంబులును శలభంబువలన శక్త్యనుకూలకర్మాచరణంబును భృంగంబువలన సారమాత్రగ్రహణవిశేషంబును స్తంబేరమంబువలన గాంతావైముఖ్యంబును సరఘువలన నిరంతరసారసంగ్రహణంబును హరిణంబువలన చింతాపరత్వంబును జలచరంబువలన జిహ్వాచాపల్యంబును బింగళవలన యదృచ్ఛాలాభసంతుష్టియు గురరంబువలన మోహపరిత్యాగంబును కుమారికవలన సంగత్యాగంబును శరకారునివలనం దదేక

నిష్ఠయు దందశూకంబువలన పరగృహావాసంబు నూర్ణనాభివలన సంసారపరిత్యాగంబును గణుందురువలన లక్ష్యగతజ్ఞానంబును సంగల పిని గుణంబు లెరిగి కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యం బులను యరిషడ్వర్గంబుల జయించి జరామరణవిరహితంబుగా జా యువశంబు జేసి గాత్రపవిత్రత్వంబున కరుగుచు షట్కర్మరతుండై విజనస్థలియందు సంచరించుచు శరీరధారణార్థంబు నియమితస్వల్ప భోజనుండై ఖేదమోదంబుసరియుగా భావించి లోభమోహంబుల వర్జించి నిర్జితేంద్రియుండై యొంటరుంగక యాత్మనిష్ఠచే బవిత్రాంతః కరణుండైన యోగి నాయందు గలియు.

పై విషయముల తాత్పర్య వివరము. భాగవతసారము.

1. భూమివలన సంపాదిహేతువులు గలిగినను భూమినిష్కం పముగా నుండును గాన నది నేర్చుకొనదగినది. 2. వాయువువలన సర్వత్రప్రచారముకలిగినను వాయువునకు సుగంధదుర్గంధాదులతో సంగములేనట్లు నిస్సంగత్వము వాయువువలన నేర్చుకొనదగినది. 3. ఆకాశము చరాచరములతో గలసినను వాస్తవముగా నాకాశ మునకు భేదములేనట్లు ఆత్మకు పరిచ్ఛేదరాహిత్యము జూడనగు. 4. జలము స్వచ్ఛత్వస్నిగ్ధత్వమధురత్వములచే జలమెట్లు దానిలో స్నానము చేసిన వారిని పావనముచేయునట్లు స్పర్శనదర్శనధ్యానము వలన మునిశిష్యులను పావనముచేయును. 5. అగ్ని తేజోవంతుడగుట వలన భక్ష్యాభక్ష్యములనుగ్రహించి ననుదోషిగానట్లు బ్రహ్మజ్ఞానికి గూడ నాటిని దినుటవలన దోషములేదని తెలియనగు. 6. చంద్రు నివలన గ్రహించునది దేహమున కీగర్భాదానాది వికారములుగాని ఆత్మకుగావని చంద్రుని క్షీణవృద్ధికళలవలె నరయునగు. 7. సూర్యు నివలన జలపూర్ణఘటాద్యుపాధి భేదముచే భిన్నుడుగ గనబడినను వాస్తవముగ భిన్నుడుగానట్లు పరమాత్మ భిన్నుడుగాడని తెలియనగు. 8. కపోతమువలన గ్రహించునది స్త్రీపుత్రాది స్నేహముచే గపోత మునశించెగాన జ్ఞాని యితరులతో సంగము చేయుతగదు. 9. అజ

గరమువలన గ్రహించునది అప్రయత్నప్రాప్తమైన పదార్థము నజగరమువలె భుజింపవలెననుట. 10. సముద్రమువలన గ్రహించునది నదీనదముల గమనాగమనములచే నేమి కాలవైపరీత్యమునగాని సముద్ర మెట్లు చలింపదో యట్లె కామాదులచే క్షోభము నొంద కూడదు. 11. మిడుత (పతంగము) వలన గ్రహించునది అగ్నిరూపముచే మిడుతభ్రమజెంది దానిలోబడి నశించిన రీతిని స్త్రీరూపమును జూచి పురుషుడు మోహమును పొందరాదని తెలియవలయును. 12. భృంగమువలన గ్రహించునది పూవులలోని రసము మాత్రము గ్రోలిన యట్లు మహాత్ములవలన శాస్త్రము విని సారమగు తత్వము గ్రహింపవలయు. 13. మొగగజమువలన గ్రహించునది ఆడఏనుగయొక్క స్పర్శముచే జెడినయట్లు ముని, కాంతా స్పర్శమువలన చెడునని తెలియవలయు. 14. తేనెటీగలవలన తేనెను పోగుచేసిన ఈగను కొట్టి తేనెను తిను బోయ కథవలన ధనసంచయముచే జెడు లుబ్ధవృత్తిమానవలయుననుట. 15. లేడివలన గ్రహించునది శ్రవణేంద్రియలోలత్వముచే చెడిపోయినట్లు చెడునుగాన శ్రవణేంద్రియలోలుడు గాకూడదు. 16. చేపవలన గ్రహించునది జింహ్వాచాపల్యంబువలన చెడినదిగాన జింహ్వాచాపల్యంబు కూడదనుట. 17. పింగళ యను భోగస్త్రీవలన సంసారమందత్యాసక్తి వదలుట. 18. కురరమువలన గ్రహించునది కురరపక్షి మాంసము నోటనుంచుకొని పోవుచుండగా నింకొక పక్షి తీసికొని పోవును గాన ధనసంగ్రహమునకు దానముండవలయునని గ్రహింపనగు. 19. బాలుడువలన గ్రహించునది అభిమానరాహిత్యము మునికవసరమని తెలియునగును. 20. పిల్లచేతి కంకణమువలన గ్రహించునది పిల్లచేతికి కంకణమున్న యెడల నిశ్శబ్దముగా యుండునట్లు సన్యాసి కితర సహవాసము కూడదని. 21 బాణముల చేయువానివలన గ్రహించునది బాణములను చేయువాని వలె నేకాగ్రచిత్తముతో నుండవలయునని. 22. సర్పమువలన గ్రహించునది చీమలు కట్టిన పుట్టలో పాము జేరినట్లు యితరుల యింటిలో సన్యాసి చేరవలె. 23. సాలెపురుగువలన గ్రహించునది ఈశ్వ

రుడు ప్రపంచమున కభిన్ననిమిత్తోపాదానకారణమని గ్రహింపనగు
24. భ్రమరంవలన గ్రహించునదిచేయు నిరంతరధ్యానముచే భ్రమర
మగునట్లు మానవుడగు ధ్యాతధ్యానముచే ధ్యేయాకారమునగునని
గ్రహింపనగు.

## 22. ఆత్మ యితరములను గ్రహించు విధము.

యతీంద్రమతదీపికలో:—గ్రహణ ప్రకారస్తు, ఆత్మామనసా సంయుజ్యతే, మనయింద్రియేన, ఇంద్రియమర్థేన, ఇంద్రియాణాం ప్రాప్యకారిత్వనియమాత్ అతోఘటాది రూపార్థస్య చక్షూరూపేంద్రియస్యచసన్నికర్షేసతి అయంఘట ఇతిచాక్షుషజ్ఞానంజాయతే.

తా. ఆత్మ మనస్సుతో కలియును మనస్సు యింద్రియముతో కలియును. ఇంద్రియము పదార్థమును గ్రహించు స్వభావము గలదగుటవలన ఘటాది రూపపదార్థములును చక్షురూపేంద్రియములును సమీపించినవగుటచే ఇది ఘట మని గ్రహించునది. చక్షుస్సుజ్ఞానమనముకును.

## 23. నాలుగు వర్ణములు పుట్టుటకు కారణము.

శ్లో॥ చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మవిభాగశః ।
తస్యకర్తారమపి మాం విద్ధ్యకర్తారమవ్యయం॥ (భగవద్గీత)

తా. గుణకర్మ విభాగమువలన బ్రహ్మక్షత్రియాది వర్ణచతుష్టయమును ఆయావర్ణాశ్రమోచిత కర్మలను నేను నిర్మించి యున్నాడను. పరమార్థమునందు వానికి నేను కర్తను కాను.

## 24. సకల శరీరములు కలుగుటకు కారణము.

సీ. సురసిద్ధసాధ్యకి ♦ న్నర వరచారణ
గరుడగంధర్వ రా ♦ క్షస పిశాచ

భూత భేతాళ కిం ♦ పురుష కూశ్మాండ గు
హ్యక శాకినీ యక్ష ♦ యాతుధాన
విద్యాధరాప్సరో ♦ విషధర గ్రహామాల్ని
గణవృకహంతఘ్నుస్ఫి ♦ ఖగమృగాళి
భల్లూక రోహిత ♦ పశువృక్ష యోనుల
వివిధకర్మంబుల ♦ వెలయ బుట్టి

తే,గీ. జలనభోభూతలంబుల ♦ సంచరించు
జంతు చయముల సత్వర ♦ జస్తమోగు
ణములదివ్యర్సురాసుర ♦ నరధరాధి
భావములభిన్న లగుచురు♦ వీరవేంద్ర. ద్వితీయస్కంధము

25. పుణ్యాపాపము లంటియుండుటను గురించి.

క. చనినచను నున్న నుండును
మనుజు డొకటి సేయు జేయు ♦ మనుజాధిప తో
డనె దగిలి నీడవోలెను
విను చేసిన కీడు మేళ్లు ♦ విడువవు వానిన్.

చ. మనుజుడు పుణ్యపాపములు♦ను నానుగ నిండొనరించుచున్ మదిన్
దనువు దొరంగి పోవునెడ♦ దప్పవు కర్మము నీడవోలె దా
వెనుకనె యేగి భూరిముఖ♦విభ్రాంతియున్ బటుదైన్య దుఃఖమున్
దనుకగ జేయు గ్రమ్మరగ♦దాన యొనర్పు భవంబు దేహికిన్.
(అరణ్యపర్వము)

శ్లో॥ శరీరం యదవాప్నోతి । యచ్చాప్యుత్క్రామతీశ్వరః
గృహీత్వైతాని సంయాతి । వాయుర్గంధానివాశయాత్ ॥

తా. పరిమళమునకు స్థానమైన పుష్పంబులందుండు వాని సూక్ష్మాంశములైన వాసనలు మాత్రము వాయువు గ్రహించుకొని పోవునట్లు దేహేంద్రియములకు ఈశ్వరుండైన జీవుడు శరీరమునుండి ఉత్క్రమించునప్పుడు సూక్ష్మములైన ఈయింద్రియములను గ్రహించుకొని పోవును. (భగవద్గీత పురుషోత్తమ ప్రాప్తియోగం.)

శ్లో॥ అర్థాంగృహే నివర్తంతే। శ్మశానేమిత్రబాంధవాః
సుకృతం దుష్కృతంచైవ। గచ్ఛంత మనుగచ్ఛతి॥

తా. మృతుడైన జీవుని ధనము యింటివద్దనే విడుచును. మిత్రబాంధవులు స్మశానము వద్ద విడుతురు సుకృతదుష్కృతములు విడువక వెంటనే వెళ్లును.

---

26. పుణ్యపాపముల యనుభవ కాలనిర్ణయము.

---

క. సమయంబైనను కుసుమ ఫ
లము లెట్టులదోచు తరువు ♦ లావరితో క
ర్మమునం బొడము సుఖదుః
ఖములట్టుల నిష్పత్తియత్న ♦ కలితోద్యోగికిన్. భారతం.

క. ద్రుమముల దశకుసుమ ఫలో
ద్గమముల క్రియకర్మముల నొ ♦ దవు తత్ఫలముల్
తమతమ పరిక ర్తకు భో
గ్యములై నియతి శుభాశు ♦ భాకారములన్. భారతం.

సీ. దుఃఖంబు బొమ్మని ♦ తోలించి సుఖంబు ర
మ్మని తెచ్చికొన వశ ♦ మయ్య! వాని
దొలిభావమునందలి ♦ దుష్కృతంబును సుకృ
తంబు హేతువులుగ ♦ దగిలి చేయు
పురుషుని కాలంబు ♦ తిరములుగావని
పొరిబొరివచ్చుచు ♦ బోవుచుండు
నర్థముల్ దుర్బుద్ధి ♦ కైనను సిద్ధించు
నగుకాలముల నార్యునకైన గాని
తే,గీ. కాలమును ఘటింప ♦ గానేరరనిల వ
ష్ఠాతపేందునుచుట ♦ నధిప కాల

కల్పితములు మంత్ర ♦ శిల్పౌషధమ్ములు
మేలుసేతకాల ♦ లీల దలప. శాంతి.

తా. తరియని చెప్పుటవలన కాలము ఖచితముగా నేర్పడ లేదని సంశయింప బనిలేదు. కాలము నిత్యము జీవుడు నిత్యుడు అగుటవలన అనాదికర్మవాసనవలన యిసుక రాసులవలెనున్న కర్మవాసనలు అపరిమితములుగాన ఒక యిసుక కణము కదలిన జారి రావటము సిద్ధమే లెక్కకు వీలులేదు. గనుక కాలతరియని జెప్పబడియె.

27. జీవకోటి రహస్యముగా జేసిన కృత్యములను కనుగొను వాటిని గురించి.

గీ. దినము రాత్రియు ఋతువులు ♦ మనుజుసేయు
సుకృతమును దుష్కృతంబును ♦ జూచుచుండు
గాన నెంత రహస్యంపు ♦ కార్యమైన
నొరులెరుంగరు నన్నని♦యునికి తగదు. అనుశాసనికపర్వం.

చ. విమలయశోనిధీ పురుష ♦ వృత్తమెరుంగుచు నుండు చూవె వే
దములును పంచభూతములు♦ధర్మువు సంధ్యలు నంతరాత్మయు
యముడును చంద్రసూర్యులు న♦హంబునురాత్రియుసన్మహావదా
ర్థము లివియుండగా నరుడు ద్రకొ్కన నేర్చునె♦తన్ను మ్రుచ్చిలన్
భారతము.

శ్రీమద్రామాయణములో సీతాదేవివారు రావణసంహారానంతరము యుద్ధస్థలమున అగ్ని ప్రవేశము చేయు నప్పుడు

శ్లో॥ ఆదిత్యోభగవాన్వాయుఃదిశశ్చంద్ర స్తథైవచ।
అహశ్చాపితథాసంధ్యేరాత్రిశ్చపృథివీతథా।
యేచాన్యేపివిజానంతితథాచారిత్ర సంయుతాం।
తథాలోకస్యసాక్షీమాం సర్వతఃపాతుపావకః॥

సీ. ఎవ్వనిచే దన ♦ యిరవొందు త్రిగుణ స్వ
భావమైనట్టి యీ ♦ ప్రాణి చయము
లను గుణనామక్రి ♦ యారూపములచేత
నేర్పడు నతిదాన ♦ మెరుగబడును
నర్యముండనలంబు ♦ నాకాశమును బ్రభం
జనుడు గోచయమును ♦ శశధరుండు
సంధ్యలు దివములు ♦ శర్వరీచయములు
గాలంబు వసుమతీ ♦ జాలములును

తే.గీ. దేహధారికి సాక్షులై ♦ తెలుపుచుండు
దండనస్థాన విధము స ♦ ద్ధర్మగతియు
దగులు మీరీక్రమాను రో ♦ ధనముసేసి
యఖిల కర్మలు దండార్హ ♦ లరయ నెపుడు.

భాగవతము అజామిళోపాఖ్యానము.

---

28. కార్యఫలముల యెడల తాకర్తగాడనుట.

---

గీ. కార్యచయముల యెడను తా ♦ కర్తనుట
కడు నెరుంగమి జన్వైతా ♦ కర్తనేని
దగిలి తనదైన కార్యజా ♦ తంబు నెల్ల
జెడక ఫలియించునట్టుగా ♦ జేయరాదె. అరణ్యపర్వము.

క. పురుషుడు కర్మాధీనత
నరుగక తనవశమె యనిన ♦ నాపదలు రుజల్
మరణంబును నివి యేమియు
బొరయక యుండంగ బ్రతుగ ♦ బోలదె చెప్పుమా. అర॥ప॥

గీ. సారమతి బరికింపగ ♦ బౌరుషంబు
కంటె దైవంబు ముఖ్యంబు ♦ కార్యసిద్ధి

కొచటనేనియు పౌరుష ♦ మెసగమెసగె
నేని యది దైవదత్తంబ ♦ యంత నిజము. శాంతిపర్వము.

---

## 29. జన్మ విషయము.

సీ. భూపాలకోత్తమ ♦ భూతహితుండను సు
జ్ఞానస్వరూపకు ♦ డైన యట్టి
ప్రాణికి దేహసం ♦ బంధమెట్లగునన్న
మహినొప్పు నీశ్వర ♦ మాయలేక
కలుగదు నిద్రలో ♦ గలలోన దోచిన
దేహబంధమ్ముల ♦ తెరవు కరణి
హరి యోగమాయా మ ♦ హత్వంబునం బంచ
భౌతిక దేహ సం ♦ బంధుడగుచు

తే,గీ. నట్టి మాయాగుణంబులు ♦ నాత్మయోలి
బాల్యయౌవన కౌమార ♦ భావములను
సరసుపర్వాది మూర్తుల ♦ బొరసియేను
నాయదిదియను సంసార ♦ మాయదగులు.

భాగవతము ద్వితీయ స్కంధము.

---

## 30. దేహవియోగము, దేవయానపితృయాన మార్గము సూక్ష్మశరీరములు.

---

అని పలికిన మునీంద్రునకు చతురాననుం డిట్లనియె.

సీ. జీవుడభేద్యుడ ♦ చ్ఛేద్యుడక్లేద్యుండు
నిత్యుడత్యధికుడు ♦ నిర్వికారి
నిర్మలుండాద్యుండు ♦ నిరతిశయానంద
సహితుండు నగుచు వి ♦ శ్వంబులోన

బటికంబుపైవర్తి ♦ పాడుగా నిల్పిన
దద్గుణాయుక్తమై ♦ తనరుమాడ్కి-
నతఁడు దేహస్థుఁడ ♦ డగుచు నద్దేహజ
కాను మోహాదికాం ♦ కలితుఁడగును

తే,గీ. నింత మాత్రనె తన్నుదా ♦ నెఱుఁగ లేక
కలుష సంచయములచేత ♦ గట్టువడుచు
బుత్రదారాది సంభ్రాంతి ♦ బొదలి పొదలి
యంత్యకాలమున దన దే ♦ హంబు విడచి.

గీ. యంత నాదేహసంగతుఁ ♦ డగుచు నంత
నట్టి జీవుండు పాపసం ♦ ప్రాప్తి ఘోర
తీవ్రనరకానుభవముల ♦ దెమలి తెమలి
మించు దుఃఖము తన్ను ♦ నిందించుకొనుచు.

వ. మఱియు నజ్జీవుండు పాపఫలానుభవాంతంబున గర్మపాశకర్షితుండగుచు వారుణలోకంబున కేతెంచి వర్షధారామార్గంబున భూలోకగతుండై తృణగుల్మలతాదులయందు సంక్రమించియున్న రూపంబున బురుషుని దేహంబు ప్రవేశించి రేతోరూపంబై ఋతుకాలంబున స్త్రీగర్భంబు జొచ్చి తద్రక్తమునంబున బొదుగుడువడి నవ మాసంబులుండి జననంబు నొందు. మత్స్యపురాణము.

మరణాంతమున ప్రతి మనుజుడును వేర్వేరు మార్గములచే వేర్వేఱు లోకముల కేగవలసి వచ్చును. ఈ మార్గముల కే పితృయానమనియు, దేవయానమనియు పేర్లు ఉత్తరాయణ శుక్లపక్ష పగటియందు మరణము నొందిన దహింపబడిన పిమ్మట నాయగ్నియందుండి జ్యోతిస్సు రూపమున ప్రయాణముచేసి బ్రహ్మపదము చెందుచున్నారు. మరల మనుష్య లోకమున జన్మింపడు. ఇదియ దేవయానము. పితృయానము, దక్షిణాయన కృష్ణపక్ష రాత్రి యందు మరణము నొందిన వారు జ్ఞానికానియెడల ధూమరూపమున చంద్రలోకమున కేగి భోగములనుభవించి మరల నిహలోకమున జన్మిం

చును. శాస్త్రోక్తములగు పుణ్యకర్మల నల్పముగనైన జేయక యూ వజ్జీవము పాపము చేయుచుండు వారు ఈ రెండు మార్గముల వెళ్లక తత్క్షణమే పశుపక్ష్యాది తిర్యగ్యోనులందు జన్మింతురు. దీనిని మూడవ మార్గమని చెప్పుదురు.

మరియు సూక్ష్మశరీర విషయము స్థూలశరీర వియోగానంతరం పంచమహాభూతముల సమ్మేళన శరీరము 24 తత్వములలో పంచమహాభూతములును కర్మేంద్రియములు అయిదును కలిసి తొమ్మిది నసించినను మిగత జ్ఞానేంద్రియములు 5 పంచతన్మాత్రలు 5 మనోబుద్ధి చిత్తాహంకారము వెరశి పదునాలుగింద్రియములు జ్ఞానహీనుడగు జీవుని తగులుకొనియే యుండును. గాన జననమరణ చక్రమునుండి విడివడడు ఇదియె సూక్ష్మశరీరము. ఇటులనే తిలకు గారి కర్మయోగశాస్త్రమందును వినదింపబడియె. అయితే వారు యిరువదిమూడు తత్వములని వక్కాణించివ్రాసిరి. భగవద్గీతయందు "మనష్షష్ఠానీంద్రియాణి" అని వున్నది. మనస్సు జ్ఞానేంద్రియములు అయిదును కలిసి సూక్ష్మశరీరమని వున్నది. మనుస్మృతియందు పంచతన్మాత్రయగు సూక్ష్మరూపమున శరీరముప్రాప్తమగుననియున్నది. గాన భగవద్గీతయందును మనుస్మృతియందు చెప్పబడినవి పదియును మనోబుద్ధిచిత్తాహంకారములతో కలసి పదునాలుగు తత్వములు సూక్ష్మశరీరమై యున్నది. పుష్పమునకు వాసన అంటియుండినట్లు ఆత్మకు అంటియుండును. విద్యావంతుడయిన సూక్ష్మశరీరమువదలి స్వచ్ఛుడై పరమాత్మను పొందును. చీకటివదిలి వెలుతురే గదా.

## 31. పునర్జన్మవిషయము.

తే,గీ. ఎదుట నిలుచు దాని ♦ నీక్షించి యన్యంబు
మరచి దానియంద ♦ మదిని నిల్పి
ప్రాణములను విడిచి ♦ హరిణమై పుట్టె ప్రా
ణావసాన భావ ♦ నావశమున. విష్ణుపురాణము.

మ. భరతుండల్లన నంత్యకాలము వెస ♦ న్బ్రాపింపగా నప్పుడా
హరిణంబున్గడు భక్తి పుత్రగతి న ♦ త్యాసక్తి వీక్షింపనా
హరిణంబున్దన యాత్మలో నిలిపి దే ♦ హంబంతట న్బాసితా
హరిణీ గర్భమునం జనించి హరిణం♦బై యొప్పెబూర్వస్మృతిన్.
భాగవతము.

గీ. విను మవిద్యకామ ♦ మునకు కామము కర్త
మనకు బుట్టబట్టు ♦ లనఘ యింత
వట్టు గారణముగ ♦ వచ్చు బునర్జన్మ
మందుత్రి తత్వవేదు ♦ లయిన మునులు. శాంతిపర్వము.

మరియు బ్రహ్మాండ పురాణములో మృగమును పులి చంప బోవుచుండగా నొక బ్రాహ్మణ కుర్రవాడు పులిని కొట్టబోవుచు రాయి తగిలి పడి ప్రాణిబోవు సమయమందు మృగముమీద దృష్టి చేత మృగమై జనించె నని యున్నది.

తే,గీ. మది గురంగిని మరిమరి ♦ స్మరణ జేయు
చునె త్యజించితి నాదేహ ♦ ముము గనుక నే
మృగముగా బుట్టినాడ నో ♦ సొగసులాడి
యెరుగ నెటు బోయిరో భ్రాంతి ♦ లెల్లనచట.

---

**32. మగశిశువు కలుగుటకు, మాతృపితృ సామ్యము కలుగుటకు వివరము.**

(బ్రహ్మకైవర్తపురాణం-ప్రకృతిఖండము)

వ. పురుషుని శుక్లము యోన్యభ్యంతరంబునంబడిన శుక్లశోణితములకు సంయోగంబు వేగిరంబుగ దక్షిణంబున నగును. రక్తాధిక్యంబగునేని మాతృసామ్యంబును శుక్లాధిక్యంబగునేని పితృసామ్యంబును సంభవించు ఋతుస్నానప్రభృతి యుగ్మ దినంబులనయ్యేనేని పుత్రుండు గలుగును. తదితరదినంబులనయ్యేనేని కన్యక సంభ

వించు. రవి, భౌమ, గురువారంబులం దగునేని యది కుమారుండ గును. అయుగ్మదినంబులందును తదితరవారంబులందు నయ్యేనేని యది కన్యక యగును. గాన యుగ్మదినంబులందును రవి, భౌమ గురువారంబులయందును నయ్యేనేని మగశిశువగును.

మరియు స్కాందం-నాగర ఖండము.

చ. ప్రతిదివసంబున న్మధుర ♦ భక్ష్యము లన్నము నారగించి స
ద్వ్రతముల బర్వవేళలను ♦ దక్కఁ బ్రశస్తములైన తారలన్
బుతువుల గూడెనేనియు దలయించు సుపుత్రుడు సర్వలక్షణా
న్వితుడగుచున్ జెలంగు నభివృద్ధి వహించు జిరాయురున్నతిన్.

## 33. చిరంజీవులుగ నుండుటకు కారణము.

బ్రహ్మకైవర్తపురాణములో-ప్రకృతి ఖండము.

వ. ఎవ్వనికిన్ ప్రథమ యామంబున స్త్రీ పురుష సంయోగమువలన కలిగిన శిశువు అల్పాయుష్యు డగును. ద్వితీయ ప్రహరంబున దానికంటె నధికంబగు నాయువుగలవాడును, చతుర్థయామంబున చిరంజీవి యగును. ఆయుర్వేదంబున గూడ నాలుగవ యామము రమించుటకు శ్రేష్ఠమని తెలుపబడెను.

## 34. దుష్టాత్మసంభవుండైనను జన్మరాహిత్యమునకు మార్గము.

గీ. వామలోచన వినుము దు ♦ ర్వర్ణ హేమ
మగ్నిపుటమున బరిశుద్ధ ♦ మై వెలుంగు
నట్లు దుష్టాత్మ సంభవుం ♦ డయ్యు వంశ
పావనుండగు హరిపాద ♦ భక్తుడగుట. భాగవతము తృతీ.

గీ. దనుజ భుజగ యక్ష ♦ దైత్య మృగాభీర
సుందరీ విహంగ ♦ శూద్ర శ్వపచు

డైన పాపజీవు ♦ డైన ముక్తికి బోవు
రఖిల జగము విష్ణు ♦ డనుచు దలచి. భాగవతము.

క. హరిసేవనా ప్రియ వ్రతు
డరయుగ కైవల్య పదవి ♦ నందుట యరుదే
ధర చండాలుండైనను
హరినామస్మరణ జెందు ♦ నవ్యయ పదముల్. భాగవతము.

గీ. హీన కులజుడైన ♦ హింసకుండైనను
బాప రహితుడైన ♦ బతితుడైన
విష్ణు భక్తి కలిగి ♦ విమలుడై వర్తింప
గలుగు నతని కమృత♦నిలయ మమర. మత్స్యపురాణము.

## 35. తెలివి వృద్ధి పొందుటకు మార్గము.

శృతిస్మృతులవలన అనగా వినిన మంచి సంగతిని శ్రద్ధతో
రిగి మననము చెయ్యడము.

## 36. మనుష్య శరీరము కలిగినందుకు చేయవలసిన కార్యము.

గీ. పడయరాని యాయు ♦ వొడలికి కలిగిన
బాపకృతుల దాని ♦ బదట గలుప
దగునె? పుణ్యవిధి స ♦ మాచరణములు గై
సేయవలయు గాదె ♦ చెలువ మిగుల. శాంతిపర్వము.

క. పరహితము సేయ బూనిన
పురుషుడు పాపంబు సేయ ♦ డందడు కీర్తిన్
బరమముని యగు నగస్త్యుడు
పరోపకారార్థకృతిని ♦ భవ్యుండయ్యెన్. శాంతిపర్వము.

గీ. ధర్మ సాధనంబు ♦ తనువు ధర్మము పరి
జ్ఞానదాయి యట్లు ♦ గాన దనువు

నోమువలయు మర్త్యు ♦ డేమిట నేమర
కాత్మ హితము గోరి ♦ యనఘ చరిత. భారతము. శాంతి.

సర్వ ప్రపంచముయొక్క కల్యాణార్థము యత్నించుటయే ముఖ్యము

గీ. పవనము నియమించి ♦ పరిహృత సంగుడై
యింద్రియముల వర్గ ♦ మెల్లమాపి
హరి విశాలరూప ♦ మందు జిత్తముజేర్చి
నిలుపవలయు బుద్ధి ♦ నెరపి బుధుడు. భాగ. ద్వితీయము

మరియు దుర్వృత్తుల కెడమియ్యక సద్వృత్తులయందె అరువది గడియలు బంచిపెట్టి ప్రతి దినము గడుపవలయు.

సర్వభూతములయందు నొక పరమాత్మయె కలడను నీ పరమావధియగు బ్రహ్మనిష్ఠయొక్క స్థితి మనకు నేతీరున ప్రాప్తించునని యెన్నుచు దాని నిమిత్తమై మనుజుడు యత్నించవలయును. బెల్లమున మాధుర్యము లోపలను వెలుపలను సమానముగ నెటులుండునో యటులే భగవంతు డంతట నిండి యుండుటను తెలిసికొనవలయును.



37. భగవంతుని కనుగొనుటకు ముఖ్యమైన సంగతి.



క. విను డక్కనుటకు మూలం
బనఘంబగు తపమయగు ట ♦ నతి నిష్ఠతపో
ధన సంయుగ్వ్రధ సముపా
ర్జనము నవశ్యంబు వలయు ♦ సన్మతులారా.



38. యోగనీతి ప్రకారము.



గీ. యోగధర్మంబు కంటెను ♦ నుత్తమంబు
గలుగ నేరదు ధర్మ మెు ♦ క్కటియు నపున

రాగమంబగు పదమున ♦ కరయ నదియు
మేటినిచ్చెన సంయమి ♦ కోటికెల్ల. భారతము.

తే,గీ. మహిత ధర్మాళి యోగ ధ ♦ ర్మంబు పరమ
పావనంబులలో నది ♦ పావనంబు
మంగళంబులలో నది ♦ మంగళంబు
గాన యోగరతుల జెప్ప ♦ గలుగు ముక్తి.
బ్రహ్మాండ-ఉపోద్ఘాతపాదము.

సీ. విను మాత్మవేత్తకు ♦ విష్ణు స్వరూపంబు
నెరుగంగబడు నది ♦ యెట్లటన్న
గగనస్థుడగు దిన ♦ కరు కిరణచ్ఛాయ
జలముల గృహకుడ్య ♦ జాలకముల
వలన దోచిన ప్రీతి ♦ ఫలితంబుచేత దా
నూహింపబడిన య ♦ య్యీనునిపగిది
నర్థిమనోబుధ్య ♦ హంకార త్రితయ నా
డీ ప్రకాశముచేత ♦ నెరుగవచ్చు
తే,గీ. నాత్మ తత్వస్వరూపంబు ♦ వలతిగాగ
జిత్తమున దోచు నంచిత ♦ శ్రీదనర్చి
యుమ్మహామూర్తి సర్వాత్మ ♦ తాంత రాత్మ
డగుట నాత్మజ్ఞునకు గాన ♦ నగును గాదె. భాగవతము

క. ధీనిధులయ్యును యోగ వి
ధానంబున జేసి మనము ♦ తగ విమలంబై
మానితమగు మత్పదముం
బూనుచురీ యోగ ధర్మ ♦ మును నెఱిగింతుం.
భాగవతము-కపిల మహాముని చెప్పినది.

వ. అదియెట్లనిన శక్తికొలది స్వధర్మాచరణంబును శాస్త్రాచారంబుల నిషిద్ధధర్మ కర్మంబుల మానుటయు దైవికంబై వచ్చిన యర్థంబువలన సంతోషించుటయు మహాభాగవత శ్రీపాదారవిందా

## పురాణేతిహాససారసంగ్రహము.

గృహము గ్రామ్య ధర్మనివృత్తియు మోక్షధర్మంబులందు రతియు మితంబై శుద్ధంబైన యాహారసేవయు విజనంబై నిర్బాధకంబైన స్థానంబున నుండుటయు హింసారాహిత్యంబు సత్యంబు నిస్తేయంబు తనకెంత యర్థంబు నుపయోగించు నంతియర్థంబు స్వీకరించుటయు ఈషణత్రయంబు వర్జించుటయు ప్రకృతిం జేరక వైరాగ్యంబవలంబించి బ్రహ్మచర్యంబు బహిశ్శౌచంబులు స్వాధ్యాయపఠనంబు పరమపురుషుండైన సర్వేశ్వరునర్చనంబు మౌనంబు నాసనజయంబును జేసి స్థైర్యంబు ప్రాణవాయు వశీకరణంబు నింద్రియనిగ్రహరూపంబున ప్రత్యాహారంబు మనంబుచే యింద్రియంబుల విషయంబువలన మరలించి హృదయంబున నిల్పుటయు దేహగతంబున మూలాధారాది స్థానంబులలో నొక స్థానంబునందు హృదయగతంబైన మనస్సుతోడంగూడ ప్రాణధారణంబు వైకుంఠుండైన సర్వేశ్వరుండు ప్రవర్తించిన దివ్యలీలాచరిత్ర ధ్యానంబు మానసైకాగ్రకరణంబు పరమాత్మయగు పద్మనాభుని సమానాకారతయు యిదియునుంగాక తక్కిన వ్రతదానాదుల జేసి మనోదుష్టంబైన యసన్మార్గంబును బరిహరించి జితప్రాణుండై మెల్లన యోచించి శుచియైన దేశంబునం ప్రతిష్ఠించి విజితాసనుండై యభ్యస్తకుశాజిన చేలోత్తరాసనంబునైన యాసనంబు జేసి ఋజుకాయుండై ప్రాణమార్గంబును కుంభక రేచకపూరకంబులను గోశశోధనంబు జేసి కుంభకపూరకంబులచేతగా ప్రతికూలంబుగావించి తీవ్రంబైన యమంబునం ప్రతప్తంబై విగతసమస్తదోషంబగు చామీకరంబు కరణివిరజంబు జేసి జితమారుతుండగు యోగికి క్రమ్మరం ప్రాణాయామంబులను పావకునిచేత వాతపైత్యశ్లేష్మంబులను దోషంబులు భస్మీకరంబులు జేసి ధారణంబుచేత కిల్బిషంబులును ప్రత్యాహారంబుచేత సంసర్గంబును రాగంబులదహనంబు జేసి సత్వాదిగుణంబులను నివారించి పరమాత్మను సంధానము చేయుచుండవలయు.

భాగవతము.

ర్చనంబు గ్రామ్య ధర్మనివృత్తియు మోక్షధర్మంబులందు రతియు మితంబై శుద్ధంబైన యాహారసేవయు విజనంబై నిర్బాధకంబైన స్థానంబున నుండుటయు హింసారాహిత్యంబు సత్యంబు నిస్తేయంబు తనకెంత యర్థంబు నుపయోగించు నంతయర్థంబు స్వీకరించుటయు ఈషణాత్రయంబు వర్జించుటయు ప్రకృతిం జేరక వైరాగ్యంబవలంబించి బ్రహ్మచర్యంబు తపశ్శౌచంబులు స్వాధ్యాయపరనంబు పరమపురుషుండైన సర్వేశ్వరునర్చనంబు మౌనంబు నాసనజయంబును జేసి స్థైర్యంబు ప్రాణవాయు వశీకరణంబు నింద్రియనిగ్రహరూపంబున ప్రత్యాహారంబు మనంబుచే యింద్రియంబుల విషయంబువలన మరలించి హృదయంబున నిల్పుటయు దేహగతంబున మూలాధారాది స్థానంబులలో నొక స్థానంబునందు హృదయగతంబైన మనస్సుతోడంగూడ ప్రాణాధారణంబు వైకుంఠుండైన సర్వేశ్వరుండు ప్రవర్తించిన దివ్యలీలాచరిత్ర ధ్యానంబు మానసైకాగ్రకరణంబు పరమాత్మయగు పద్మనాభుని సమానాకారతయు యిదియునుంగాక తక్కిన వ్రతదానాదుల జేసి మనోదుష్టంబైన యసన్మార్గంబును బరిహరించి జితప్రాణుండై మెల్లన యోచించి శుచియైన దేశంబునం ప్రతిష్ఠించి విజితాసనుండై యభ్యస్తకుశాజిన చేలోత్తరాసనంబునైన యాసనంబుజేసి ఋజుకాయుండై ప్రాణమార్గంబును కుంభక రేచకపూరకంబులను గోశశోధనంబుజేసి కుంభకపూరకంబులచేతఁ ప్రతికూలంబుగావించి తీవ్రంబైన యమంబునం ప్రతప్తంబై విగతసమస్తదోషంబగు చామీకరంబు కరణివిరజంబుజేసి జితమారుతుండగు యోగికిఁ గ్రమ్మరం ప్రాణాయామంబులను పావకునిచేత వాతపైత్య శ్లేష్మంబులను దోషంబులు భస్మీకరంబులుజేసి ధారణంబుచేత కిల్బిషంబులును ప్రత్యాహారంబుచేత సంసర్గంబును రాగంబులదహనంబు జేసి సత్వాదిగుణంబులను నివారించి పరమాత్మను సంధానము చేయుచుండవలయు.

భాగవతము.

క. సదిరయము వారణేంద్రుడు
గుదియించినయట్లు పోలె ♦ గురువరదైన్యా
స్పదమగు విషయోల్లాసము
గుదియించును యోగసిద్ధ♦గురు హృద్బలుడున్. భారతము.

క. జనవర యసిధారావ్రత
మన దగియెడు ధారణా ని ♦ యతి పనుపడు నె
వ్వని చిత్తంబున నాయో
గ నిరూఢున కరిదియైన ♦ కార్యము గలదే. భారతము.

క. యోగ నిరూఢుడు సంగ
త్యాగానందైక నిరతు ♦ డతనికి జన సం
యోగము మృతిదైన్యంబును
భోగాభోగ సుఖదుఃఖ ♦ ములు లేవధిపా. భారతము.

క. ప్రకృతి పదారు వికారము
లకు నాశ్రయ మాత్మ కవి నె ♦ లవు విను మాత్మం
డ కుటిల తేజోరూపత
బ్రకృతియు వికృతియును గాక ♦ ప్రస్ఫురితు డగున్.

గీ. రత్నములు హేమములు నను ♦ రాగలీల
నమ్మకంబుల నావల ♦ నీవలైన
భంగినరులందు పురుషుండు ♦ నెలమి తిరుగు
చుండు దానెందు చెడదు......॥ భాగవతము.

ఉ. చెందుచునుండు పుణ్యములు ♦ చేసి సురత్వము మధ్యకర్ముడై
యొందు నరత్వము న్దురిత♦యోగమున నన్పశుకీట భావమున్
బొందు సుఖంబు దుఃఖమును ♦ బొందిన జీవుడు దీనిభేద శ
క్తిన్ దెలియంగనేర్చిన మ♦తి న్గల యాతడుగోరు మోక్షమున్.

క. క్షయవృద్ధుల బందుడు న
ద్ధియు లోనుగ బొందుచుండ ♦ తెలియదు బంధు

క. సదిరయము వారణేంద్రుకు
గుదియించినయట్లు పోలె ♦ గురువర దైన్యా
స్పదమగు విషయోల్లాసము
గుదియించును యోగసిద్ధ♦గురు హృద్బలుడున్. భారతము.

క. జనవర యసిధారావ్రత
మన దగియెడు ధారణా ని ♦ యతి పనుపడు నె
వ్వని చిత్తంబున నాయో
గ నిరూఢున కరిదియైన ♦ కార్యము గలదే. భారతము.

క. యోగ నిరూఢుడు సంగ
త్యాగానందైక నిరతు ♦ డతనికి జన సం
యోగము మృతిదైన్యంబును
భోగాభోగ సుఖదుఃఖ ♦ ములు లేవధిపా. భారతము.

క. ప్రకృతి పదారు వికారము
లకు నాశ్రయ మాత్మ కవి నె ♦ లవు విను మాత్మం
డ కుటిల తేజోరూపత
బ్రకృతియు వికృతియును గాక ♦ ప్రస్ఫురితు డగున్.

గీ. రత్నములు హేమములు నను ♦ రాగలీల
నమ్మకంబుల నావల ♦ నీవలైన
భంగినరులందు పురుషుండు ♦ నెలమి తిరుగు
చుండు దానెందు చెడడు......॥ భాగవతము.

ఉ. చెందుచునుండు పుణ్యములు ♦ చేసి సురత్వము మధ్యకర్మదై
యొందు నరత్వము స్ఫురిత♦యోగమున నన్యశుకీట భావమున్
బొందు సుఖంబు దుఃఖమును ♦ బొందిన జీవుడు దీనిభేద శ
క్తిన్ దెలియంగనేర్చిన మ♦తి న్గల యాతడుగోరు మోక్షమున్.

క. క్షయవృద్ధుల జందు్రిడు న
ధియు లోనుగ బొందుచుండ ♦ తెలియదు బంధు

క్షయమునకు వగచు నజ్ఞుం
డయి మహితా దీని నెరుగు ♦ ట మలత దెచ్చెన్.

గీ. విష్ణుమాయను దోచు నీ ♦ విష్టపములు
భిత్తిచిత్రంబు విధమున ♦ ఫేనభంగి
బుద్బుదాకృతిగాగను ♦ బుధుడు వీని
సరకు సేయక మోక్షంబు ♦ తెరవు వెదకు.

క. విను తెవులుకు పగభేషజ
మునకు న్దలకొనిన చంద ♦ మున మది సత్యం
బును శౌచము శమముం దమ
మును నెలకొలుపంగ వలయు ♦ మోహచ్యుతికిన్.

గీ. ఎల్లయెడలకు వెలువడు ♦ నింద్రియముల
చాల పుత్త్రిల తండ్రియు ♦ బోలె నాగు
నవియు మనమును నిశ్చలై ♦ త్యాగ భావ
మొందు టుత్తమపదము స ♦ ముజ్వలాత్మ.

క. భూతము లన్నియు నడగిన
యాతటి దనుతాను గనుచు ♦ నంజనరహిత
త్వాతిశయ మెసగ వెలిగెడు
నా తెలివాతత్త్వమునకు ♦ నమరు మహేశా. అనుశాసనికము

క. పరులెవ్వరు తామెవ్వరు
పరికింపగ నేకమగుట ♦ భావింపరు త
త్పరమ జ్ఞానము లేమిని
పరులును తామనుచు దోచు ♦ బ్రాణుల కెల్లన్. భాగవతం

గీ. తనకు దాన గలడు ♦ జననంబు నప్పాడు
మరణముననుసు గతి ♦ నరకములను
తల్లిదండ్రి దక్కు ♦ నెల్ల బంధులు శరీ
రంబు ననుగమించి ♦ క్రమ్మఱుదురు.

గీ. ధర్మసాధనంబు ♦ తనువు ధర్మము పరి
జ్ఞానదాయి యిట్లు ♦ గాన దనువు
నోమవలయు మర్త్య ♦ డేమిట నేమర
కాత్మ హితముగోరి ♦ యనఘ చరిత.

క. అసమాలంబమశబ్దము
రసగంధస్పర్శ రూప ♦ రహితమగుణము
ల్లసిత గుణమ్మగు వెలుగున
భ్యసన నియతిపరుడొకండు ♦ బడయుఁ బుత్రీ.

గీ. అనఘ ముంజ గర్భ ♦ మును నిషీక నిదర్శ
నంబుగాగ గనుగొ ♦ నంగవలయు
దనువు ముంజ మాత్మ ♦ దదిషీక నిష్కర్మ
విధము సుమ్ము యోగ ♦ విదుని వెరవు.

క. తనువువలన నిష్కర్మం
బొనరిచి జీవాత్మగాంచు ♦ యోగివరుం డ
య్యనువు నొదవి యట్లు దన్ను
న్గనినప్పుడు జనన మరణ ♦ గతులం దొరగుఁ.

క. తనయందు తన్ను లెస్సగ
గనుట న్గడచిన సుఖంబు ♦ గలుగదు లోకం
బున నందు దాని కయ్యెడు
వినుతానుష్ఠానమునకు ♦ విసువమివలయుఁ.

గీ. పాలకడవ పెక్కు ♦ పశువుల లోపల
డించి నాతడట్లు ♦ దానినరసి
కొనుచు నుండునట్లు ♦ నునుచిన మనసు నే
మరక యాత్మ వెదకు ♦ తెఱవు మేలు.

గీ. అయ్యనాది తత్వము చక్షు ♦ రాదికంబు
లైన ఇంద్రియములకు గ్రా ♦ హ్యంబు గాదు

సకలమలనిరాసాద్య ప్రి ♦ సన్నుతర మ
నఃప్రదీపంబు తద్దర్శ ♦ నం బొనర్చు.

గీ. ప్రాణుబోదవుట ప్రాణి యు ♦ పాను జెంది
తాను దానభూతాత్ముడై ♦ దనువు విడచి
వ్యానచేష్టిత సర్వసం ♦ వ్యాప్తినొంద
మనసు సుస్థితినొందు స ♦ మానునందు.

సీ. విను మహోరాత్రంబు ♦ లును శుభాశుభములు
సత్యానృతంబులు ♦ సదసదా హ్వా
యములును నైన ద్వం ♦ ద్వములు ప్రాణాపాన
ములకు నామాంతర ♦ రములు తదీయ
మధ్యవర్తితనొప్పు ♦ మహనీయ వహ్నిను
దానంబు దాని ని ♦ ద్వంద్వభావ
మాంతరయోగ వి ♦ ద్యాప్రవీణులు గండ్రు
పరమశాంతి యనంగ ♦ బ్రహ్మమనగ

తే,గీ. నరయు భేదంబు లేదన్న ♦ యట్టులుండు
నమ్మహావస్తువునకును ♦ నాకృతిది యు
నంగ జెవియూరవిందుము ♦ నలినగర్భు
చేతనని దివ్యముని యిట్లు ♦ చెప్పె కరుణ.

క. యీలోకంబుల నెల్లం
కాలము పక్వమ్ము సేయు ♦ గా నెవ్వం డ
క్కాలము పక్వము సేయుఁ
జాలును నతడమృతునజరు ♦ సత్యు గనుటకుఁ.

క. మనసును నింద్రియములునుఁ
దనయందొదుగంగ జేయు ♦ తాను తెలివి నొం
ది నిరంజనత్వసిద్ధిఁ
గని గతధూమానలంబు ♦ కరణి వెలుంగుఁ.

గీ. దిక్కు వలుకక దివియెల్ల ♦ దిక్కటిలగ
దానయున్నట్లు గనుచు నే ♦ మేని గుడిచి
యెద్దియేనియు [illegible] ♦ యందేని శయనించు
నతని దేవతల్ బ్రాహ్మణు ♦ డంచు బుత్రా.

క. అవయవము లెట్లు కూర్మము
నివృరించును లోనికడచ ♦ నెరినట్లులభూ
తవితతి భూతాత్ముండును
ప్రవర్తన నివర్తనముల ♦ బాల్పడ జేయుఁ.

క. విను జ్ఞైదింద్రియములకును
మనంబుష్ఠంబు సప్త ♦ మత్వము బుద్ధిఁ
పనిగొను భవ్యక్షేత్ర
జ్ఞుని యందష్టమత గల్గు ♦ సుగుణాభరణా.

క. విను మూర్ణనాభితంతువు
జనియింపగ జేసినట్లు ♦ సాత్వికగుణ సం
జనకంబగు నది పురుషుడు
గనుట నుదాసీనతను వి ♦ కారము గలదే.

క. ధనములు బంధులు భోగము
లనియెడు నస్థిరములెల్ల ♦ నాత్మకెరవు చే
సిన శాంతియలవడును మన
మున శాంతి శ్రీసమృద్ధి ♦ మోక్షము నిచ్చుఁ.

గీ. మనసు మనసునంద ♦ మడియించి యాత్మను
ఆత్మయందుఁగాంచు ♦ నట్టి యతడు
సర్వవిదుడు తన్ను ♦ సకల భూతవితతి
గనుచునుండు ♦ నిర్వికల్పముగను.

గీ. ఆత్మతత్వమేకంబ దీ ♦ పాంతరముల
గలుగజేయు ప్రదీపంబు ♦ కరణి నావ

హించు రూపాంతరముల న ♦ య్యోలమియును బు
ధుండు గనుఁగొని భ్రమయక ♦ యుండు నకటా.

క. పవనంబేకము ప్రాణా
దివిభేదము లైదు విను త ♦ దీయంబులు వా
ని విధంబులరయ నిశ్చల
మవునది యాసుకృత మంత ♦ రాత్మను జూపుఁ౯.

గీ. అపుడు బుధ్యమానుని గను ♦ సప్వర్ణిష్ఠ
తత్వమవ్యక్తమండ్రు త ♦ ద్దర్శియగు ప్ర
బుద్ధుఁడాతని నతనిని ♦ బుద్ధుఁడెరుగు
చుండు నివి యాత్మ దశలత ♦ డొకఁడ యనఘ.

వ. అవ్యక్తప్రభవంబును బుద్ధిస్కంధంబును నహంకారవిట
పంబును మహాభూతోపశాఖంబును నింద్రియకోటరంబును సంతతశా
ద్వలంబును శుభాశుభఫలంబునునై సంసార వృక్షంబు నొప్పుచుండు

క. జ్ఞానాసినదినరికి యభి
మానాహంకార దూర ♦ మతియగు బురుషుం
డానందము ప్రస్ఫుటముగ
గానంగానేర్చు విగత ♦ కల్మషులారా.

గీ. పరమనియతి యనగ ♦ ప్రాణసంయమ మనం
బడి క్రమాభివృద్ధి ♦ నలవరింప
గా ప్రసాదలబ్ధి ♦ కలిమి ధృవంబ వ్వి
శేష కలనమిష్ట ♦ సిద్ధి జేర్చు.

క. వినుడీ సత్వస్థు పురుషు
గనుఁగొను డనుమాన కలన ♦ గాని మదిం ద
క్కిన తెరగేమిటనైన
న్గనుకొనిమొద మనుట వెరవు ♦ గాకుండు జుడీ.

గీ. తటినిదగనుత్తరించు నం ♦ తకును పోత
మాశ్రయించి తర్కొల్లని ♦ యట్లు పురుష
దర్శనము సంభవించు నం ♦ తకును సత్వ
మాది పిదప దత్సంబంధ ♦ ముడుగు డనియె.

క. భూతముల తారతమ్యము
జేతోగతమైన యట్టి ♦ శిష్టజనము ప్ర
ద్యోతితుడగు పురుషుగని ని
రాతంకావ్యయ పదంబు ♦ ప్రాపింపగనున్.

క. శరనిధితరగలభంగిన్
బొరిబొరి నవ్యక్తమునన ♦ బుట్టు నడంగున్
సురనరధరణీరుహాచయ
చరాచరానేక భూత ♦ జాలము లెల్లన్.

క. అవ్యక్తాదిక సకలము
నవ్యయుడగు పురుషుడాశ్ర ♦ యంబుగ బరగున్
సువ్యక్తంబుగ నిది గను
భవ్యులు వడయుదురు మోహ ♦ బంధ విము

క. మమతాహంకృతి విడిచి త
పమున ప్రజాపతి సమీప ♦ భవ్యపదము నం
యమి పొందునిందు సందే
హ మొకింతయు లేదు నిర్మ ♦ లాత్మకులారా.

గీ. సాధు లింద్రియ విశ్రాంతి ♦ సంహరింతు
రఘము తెలసి ప్రాయశ్చిత్త ♦ మాచరింతుర్
దానము ప్రకాశంబుగ ♦ నాచరింతు
రఖిల భూతదయాళుత్వ ♦ మరయగలరు.

క. నేయిపాలుపడిన దివియయు
మాయుకరణి కర్మసిద్ధి ♦ మలిగిన హీన

త్త్వాయత్తుండై తాను
మాయను దైవానుకూల్య ♦ మహిమ మహేశా.

క. కోరికయు నొల్లమియు లే
కేరూపున భూతములకు ♦ యెగ్గగు తెరగున్
జేరక యకామవృత్తి త
నోరతినున్నతడు బ్రహ్మ ♦ ముం బ్రాపించున్.

గీ. కాలచక్రంబు నిరవధి ♦ కంబు దీన
సర్గములు ప్రళయంబులు ♦ జనుచు నుండ
ప్రళయమున పరమాత్ముండు ♦ ప్రకృతిజెంది
యఖిలమును సృజియించు క ♦ ల్పాదియందు.

క. ఇదినాయదియను నూత
న్మది నెయ్యది పట్టుకొల్పి ♦ ననువాసితమై
తుదిచేటునొంది వానికి
నదిశోకము నావహించు ♦ నత్యంతంబున్.

గీ. సత్కులంబున బుట్టుట ♦ సకల వేద
ములు బురాణంబులును శాస్త్ర ♦ ములును చదువు
టయును సద్గతుజేయ ప్రా ♦ ఫలవిగావు
శీలసామగ్రిలేని దు ♦ శ్చేష్టితునకు

గీ. హింసలేక యునికి ♦ ఇంద్రియ జయము వై
రాగ్యము చపలత్వ ♦ మను గుణములు
నాల్గుగల్గునట్టి ♦ నరునకు కరతలా
మలక మంతరాత్మ ♦ మహిమ లెల్ల.

గీ. సత్యమార్గాభిరతి యాత్మ ♦ తత్వ దర్శ
నంబు గావింప దనుదాన ♦ నరుడు గాంచు
విశ్వమున దాను దనయందు ♦ విశ్వమును వ
సించుటయు జూచుచును ముక్తి ♦ జెందియుంట.

గీ. జ్యోతి యాత్మయందు ♦ నున్నది గాంచ శ
క్యము సమాహితాత్మ ♦ డైన మునికి
నొరులవలన తనకు ♦ నొరులకు తనదెస
భయము లేక యున్న ♦ బరముగాంచు.

గీ. ఇంద్రియములలో నొక్కటి ♦ యేని పటుత
పడక నెడలిన నాగంటు ♦ పక్షిగారు
నట్లు గావున మనసు ము ♦ న్నాగివినికి
యానెయగు నైదు క్రమమున ♦ నాగవలయు.

క. సుత విను శబ్ద బ్రహ్మని
యతివర్తించు భువన త్ర ♦ యమునను యోగా
న్వితుడగు మునిగనునజు శా
శ్వతు నచలు బురాణతము న♦జరు బరమాత్మున్.

గీ. ఇంద్రియముల నేనింటి ♦ నిట్లు విషయ
ములకు నొలయక యుండగ ♦ నిలువరించి
తలపులుడిగెనేనియు బ్రమ ♦ దమున నాను
భంగి తృప్తుడైయుండియు ♦ పరముగాంచు.

చ. తన కుసుమంబులన్ ఫలవి♦తానము మూర్కొన నాన మాని నునే
రని క్రియగాన నేరడు బ ♦ రంబగు తత్వము నైజభంగి వి
న్ననవున నంతరాత్మగను ♦ నైష్ఠికత న్గనుచుండ వట్టి పా
మెనసిన తొలువాయు క్రియ♦నీవు దొరంగుడు పాపపుంజముల్.

క. ఒరులకు దావెరవక తన
కొరులు వెరువకుండు నట్టు ♦ లొప్పెడు సమతన్
థిరమైన నడవడిక గల
పరిణత చిత్తుండు సువ్వె ♦ బ్రాహ్మణు డసఘా.

క. పొరిబొరి భూతముల గుణో
త్కరము విశేషాన్వితముగ ♦ గనుగొను సంవి

త్వరుదుఃఖము సౌఖ్యముచే
విరియు దరణిచేత దమము ♦ విఁసిన భంగిఁ.

గీ. తనదియనక యే వి ♦ ధంబున బ్రియమొందు
యద్ది గుడువకుండ ♦ నెసగుత్పప్తి
యిచ్ఛపొందు లేక ♦ యెయ్యది సుఖమిచ్చు
దాని గనుట శ్రుతుల ♦ తలపు గనుట.

క. ఇనురూపము జలముల దో
చిన క్రియబుద్ధి ప్రతిబింబ ♦ సిద్ధత వెలుగొం
దిన యాత్మను పరమార్థఁత
గను సత్వస్థులకు నిజము ♦ గానంగ నగుఁ.

క. కర్మారాముఁడు సంతత
ధర్మసఖుఁడనై యసంగ ♦ తానిష్ఠమతిఁ
నిర్మలుఁడగు వానికి ని
ష్కర్మత్వానంద సిద్ధి ♦ గలుగు మునీంద్రా.

గీ. నగములెల్ల పుణ్య ♦ నగములు నదులెల్ల
పుణ్యనదులు వినుము ♦ భూసురాగ్ర
గణ్య యకలుషంబ ♦ కర్దఁమ మనజాలు
నాత్మవిధమెరుంగు ♦ న కలుషునకు.

క. అనఘామృత్యువు నమృతం
బును దేహమునందు గలవు ♦ మోహము మృత్యు
త్వ నిరూఢమున్నరూపును
గను టమృతత్వోపహితము ♦ గాన నెరుగుమీ.

గీ. అధివలఘ్వాశియై ఇంద్రి ♦ యు ప్రపంచ
జయముగలిగి మోక్షార్థోక్త ♦ సారధర్మ
నిరతినుండెడు వానికి ♦ పరమమగు ప
దంబు తంగేటి జన్ను చం ♦ దంబు నొందు.

నై్జరవు జనన మరణములు
గారించును దీని భంగి ♦ గానక యున్నఁ.

క. ఒరుల పనికిగా నిజహిత
విరహితు డగునట్లుగాదె ♦ వివిధేంద్రియ కా
ర్యరతుండై యాత్మన ము
ద్ధరణంబొగి చేయకునికి ♦ ధరణీనాథా.

క. వినుము మృణాళంబు సనం
టినఁ బొంపి జలంబులోఁ గ ♦ డిగినను బెడబా
సిన క్రియ విమలజ్ఞానం
బున సంసారంబు వాయు ♦ పురుష నరేంద్రా.

క. నరనాయక శిశ్నోదర
పరాయణుండగుచు నొండు ♦ పరికింపడు దు
ర్నరు డెలుక బిల్లి వాడవిన
వరుసన జరవాడవు ముక్తి ♦ బడయక బోరియుఁ.

గీ. వేరుగు పెద్దైన నోడ వా ♦ రిధి దరింప
లేని భంగి మనోభవా ♦ లీఢ వృత్తి
యగుచునుండు జీవుండు భ ♦ వాబ్ధి యుత్త
రింపలేడది నిజము గ ♦ రిష్ఠచరిత.

గీ. యోగతంత్రంబు సకల శా ♦ స్త్రోదితంబు
విను విశేషించి లోకైక ♦ విభుడు చెప్పె
దీని నారాయణుడు ముని ♦ మాననీయ
మిది మనంబున తెలసి కొ ♦ మ్మిద్ధచరిత.

గీ. అమలవాయు సేవ ♦ నము నిర్మలత్వంబు
గలుగగా బదారు ♦ కళలు పూర్ణ
డగు సుధాంశుమాడ్కి ♦ నక్షరమమలి న
ఖండ శాంతి బోధ ♦ ఘనత వెలుగు.

క. విచ్చలవిడి నింద్రియముల
నెచ్చటికైనం జనంగ ♦ నిచ్చిన నరకం
బచ్చుపరచు గుదియించిన
దెచ్చు సుగతి నరున కది స ♦ తీమౌళి మణీ.

గీ. ప్రకృతిదొరగిన దన్ను ♦ బన్నుగా జూచు వి
వేక దృఢతపంచ ♦ వింశకుండు
సంగరహితమైన ♦ షడ్వింశపదము ని
స్సంశయముగ గాంచు ♦ వంశవర్య.

గీ. మాతృపితృదారపుత్రక ♦ భ్రాతృశత స
హస్రములు గల్గి సంసృతి ♦ ననుభవింప
బడియె నందులో నెవ్వరి ♦ కడలువాడు
నరుడ నిత్యత యూహించు ♦ టరయ నురువు.

సీ. కొంచపు టశనంబు ♦ గొనుచు సంగమములు
బాసి యింద్రియముల ♦ పజ్జనమి
శబ్దాదియైన వి ♦ షయజాత మంతరం
గమునకు సందడి ♦ గాకయుండ
సద్బుద్ధి దృఢమగు ♦ సాధనంబును గొని
మరలిచి యాత్మను ♦ మనసు నిలిపి
అపగతసంకల్పు ♦ డై యుపలస్థాణు
భంగికస్థితి బను ♦ పడి దినంబు

తే.గీ. రాత్రియును యోగసేవాను ♦ రతినివాత
దీపమునుబోలె వెలుగ నా ♦ త్మీయ మూర్తి
గనుచు నెడనెడ నుపశమ ♦ కాలములు స
నంగ వర్తించు యోగి యా ♦ నంద మొందు.

క. యోగులచేత నుపాయము
రోగంబులు బొడమకుండ ♦ రోయబడియె నా

ళాగత జలమట్లనిలము
దాగ్రివలెఁ మెల్లనఁ జి ♦ త్రశ్రముడగుచున్.

(మార్కండేయం.)

ఉ. ఆదిని నాభియున్ హృదయ♦మంత నురంబును కంఠమున్ ముఖం
బాదట నాసికాగ్రమును ♦ నక్షులు భ్రూయుగమధ్యముల్ శిరం
బీదశకంబునందు నొక ♦ యించుక పూర్వముకంటె పైపయిం
బోదిగ ధారణాదశక ♦ మున్ గొని యోగిత దక్షరాత్ముఁడా.

తే. రాజయోగంబుబూని ని ♦ రంతరంబు
పట్టుగా నభ్యసింపంగ ♦ పాలుమాలి
కొన్ని వేదాంతయుక్తులు ♦ కూడబెట్టి
బలుకనేర్చిన బ్రహ్మంబు ♦ భవముగలదే.

(సీతారామాంజనేయం.)

క. యుక్తాహారవిహారుడు
యుక్తస్వప్నావబోధు ♦ డు రుకర్మములన్
యుక్తవిచేష్టుండగు ఘన
యుక్తునకగు పరము రాజ ♦ యోగము సుఖమై.

చ. ఇతరము మాని తన్ను మది ♦ నెంతయు నెమ్మి భజించువారి నా
శ్రిత జనసేవితాంఘ్రి సర ♦ సీరుహుడైన సరోజనాభు డం
చిత దయతోడ నిష్కృపతు ♦ చిత్తమునం గరుణించు నట్టి వా
రతుల దురంతమై తనరు ♦ నవ్యభుమాయ దరింతు రప్పుడున్.

(ద్వితీయ స్కంధము.)

చ. జనవర సౌఖ్యముం బొరసి ♦ సాత్త్వికభావ సముద్భవంబు సు
మ్మనియును దుఃఖముల్ గదిరి ♦ నప్పుడు రాజసభావభంగి సు
మ్మనియు జడత్వ సంగ సమ ♦ యంబున తామసభావ వృత్తి సు
మ్మనియును దోచివానిబడ ♦ కాత్మరతిన్ని లుపిచ్చు మోక్షమున్.

(శాంతి.)

## 39. సాంఖ్యపరికారము వసిష్ఠుడు జనకునకుపదేశము.

క. అనులోమంబున సృష్టియు
జనవర ప్రతిలోమవృత్తి ♦ సంహారముగ
లును జననపరిశయంబుల
తనకు బహుత్వంబు నేక ♦ తయు శోభిల్లున్.

వ. క్షేత్రంబన ప్రకృతియన నొక్కటియ. జీవుండు ఆ క్షేత్రంబును నెఱింగినవాడు గావున క్షేత్రజ్ఞుడును క్షేత్రక్షేత్రజ్ఞులు వేరగుట ప్రస్ఫుటంబు అవ్యక్తంబు, జ్ఞానంబు, నిర్గుణంబు, నిర్మలుడు, స్వయంపరికాశి, నిత్యుడు, అమృతుడు, అక్షరుడు, అవ్యయుండు, అనూతుడు, అనాశుడు, సనాతనుడు. ఇది సాఖ్యపరికారంబు. ఇట్లు సాంఖ్యానురూపంబున పరికృతినేర్పరచి పురుషుండు తన్నుదాన గనుచుండ కైవల్యంబు సిద్ధించు నట్టిదయు పునరావృత్తి పదంబు పంచవింశ తత్వవిశిష్టుండగు పురుషుండు ప్రబుద్ధుడు అక్షరుడనంబరగు.

గీ. జలము గదిసియుండ ♦ జలముచే నార్ద్రంబు
గాక యుండు నట్టి ♦ కమలదళము
భంగి నంతరాత్మ ♦ పరికృతి బొందియు నంద
వికృతి బొందకుండు ♦ వీతదోష.

గీ. యోగి చూచు భంగి ♦ నుర్వీశ సాంఖ్యుండు
చూచు సాంఖ్యుడరయ ♦ చొప్ప యోగి
వరుడు నరయు గాన ♦ వారిద్దరును నొక్క
తెరవు వారలందుఱి ♦ పరమ మునులు.

## 40. భగవత్కథలు చదువుటవల్లను పెద్దల సేవ చేయుటవల్లను గల్గు లాభము.

క. శరితమువలన శ్రోత్రియుడగు
నతుల తపోయుక్తి గడు మ ♦ హాత్మ్యము వడయున్

ధృతిచే సహాయయుతుడగు
నతిశయముగ బుద్ధి మంతు ♦ డగు బుధసేవన్.

సీ. ధరలోన బ్రహ్మంబు ♦ దపమున దానంబు
లను గృహ ధర్మంబు ♦ లను జలాగ్ని
సోమ సూర్యులచేత ♦ క్రతులచేనైనను
పరమ భాగవతుల ♦ పాదసేవ
బొందిన మాడ్కిని ♦ బొందగ రాదని
పల్కుదు రార్యులు ♦ పరమ మునులు
ఘనతపోబాహ్య సౌ ♦ ఖ్యములకు విముఖులు
నైపుణ్యులు హరి గు ♦ ణానువాద

గీ. మోదితాత్ములు నగు బుధ ♦ పాదసేవ
ననుదినంబును జేసిన ♦ నంత మీద
మోక్షమార్గంబునకును ప ♦ ద్మాక్షునందు
పట్టువడియుండు నెప్పుడు ♦ బరగ బుద్ధి.
(భాగవతము పంచమస్కంధము.)

భగవత్కథలు చదువుటవలన తారకయోగ మలవడును.

---

### 41. చూపు నిలచి తపస్సువలన గలుగు ఫలము.

---

తే. తపమువలన విరాట్టు ప ♦ దంబు గలుగు
బ్రహ్మ కర్మమ్ము సన్యాస ♦ వశత గలుగు
బ్రకృతి విజయంబు గలుగు వై ♦ రాగ్యకల న
జ్ఞాన సిద్ధి గైవల్య వా ♦ సంబు దొరకు.
(బ్రహ్మాండ పురాణము.)

క. నారద పర్వత దేవల
భారద్వాజాదులైన ♦ పరమ మునులు ధ

ర్మారంభంబున వడసిరి
గౌరవమట్లగుటధర్మ♦కరణమువలయుఁ. (శాంతిపర్వము)

## 42. పురాణ శ్రవణ ఫలము.

గీ. విమల ధర్మకథల్ పురా ♦ ణములు పలుకు
గాన సంసారవారిధి ♦ గడవగోరు
వారు విననగు దత్కథా ♦ వర్ణనమున
బూర్వ జన్మార్జితాఘముల్ ♦ పొలియుకతన.

## 43. దృఢాభ్యాసమువలన కలుగు ఫలము.

శ్లో॥ భావితంతీవ్రసంవేగా దాత్మ నాయత్తదేవసః
భవత్యాశు మహాబాహోవిగతేతరసంస్మృతిః॥

తా. గొప్ప భుజములుగల రామా! పురుషుఁడు యేవస్తువైన దృఢాభ్యాసంబుచేత చిత్తంబు నిలుకడ కలుగు నటుల భావించి ఇతర వస్తువును భావింపక యుండెనేని త్వరగా ఆ వస్తువె తానయ్యెడినని యర్థము. (వాశిష్ఠ రామాయణము.)

## 44. ధర్మముయొక్క ఫలితము.

ఉ. ధర్మమునఁ ప్రజాహితము♦దార్కొనుఁవేల్పులు మెత్తురార్యులుఁ
గూర్మి వహింతు రర్థమును♦గూర్పకయే యభివృద్ధి బొందు దు
ష్కర్ములు భీతి జెందుదురు ♦ శత్రులడంగుదు రిష్టసిద్ధియా
నిర్మలకీర్తియు స్థరణి ♦ నిల్చు దివంబును గల్గు పుత్రికా.

(ఉత్తర రామాయణము.)

గీ. అర్థసిద్ధికంటె ♦ నరయ నెక్కుడు ధర్మ
సిద్ధి దాన సకల ♦ సిద్ధులును ప్ర
శస్తభంగి జేరు ♦ శాశ్వత కీర్తియు
సంభవించు గలుగు ♦ సద్గతియును. (శాంతిపర్వము.)

---

45. సత్యాలోకనివలన గలుగు నమిత ఫలము.

---

సీ. ధర్మదేవత దయ ♦ దళుకొత్తగా గట్టె
జనులార మీరెల్ల ♦ స్వర్గమునకు
రండు దుర్లభమది ♦ రమ్యవిమానాగ్ర
కోటి సంకులమయ్యె ♦ కుతల మస్మ
దీయ లోకమున కే ♦ తెండంచు నిట్ల యో
ధ్యాపురంబున కేగి ♦ యమర విభుడు
బలికిన విని జను ♦ లబహు హర్షకలితులై
యారాజు కరుణచే ♦ నఖిల జనులు

గీ. పుత్రభృత్యకళత్ర సం ♦ పూర్ణులగుచు
తగు విమానము లెక్కుచు ♦ గగనమెల్ల
నిండ జని స్వర్గలోక మం ♦ దుండి రప్పు
డా హరిశ్చంద్రునకు మోద♦మతిశయిల్ల.(మార్కండేయ పు)

హరిశ్చంద్రుని కడకు దేవతులు వచ్చి తత్పుత్రుని బ్రతికించుటలో సత్యహరిశ్చంద్రుని చరిత్రము యెల్లరకు విశదమే.

---

46. ధర్మమునెడ ననాదరణ చేసెనేని కలుగు నష్టము.

---

క. ధనమునకై ధర్మము దెస
ననాదరము జేసెనేని ♦ నానృపతికి న
ద్ధనమును జెడు దుర్యశముం
బనుగొనుదుది దుర్గతియును♦పాటెలు ననఘా. (శాంతి)

## 47. గురువును నరునిగాదలచిన గలుగు నష్టము.

క. హరి మహిమ తనకు జెప్పెడి
గురువున్ నరుడనుచు దలచు ♦ కుంఠిత భక్తిన్
దిరుగు పురుషు శ్రమ యెల్లను
కరిశౌచము క్రియ నిరర్థ♦కంబగు నధిపా. భాగవతము.

## 48. ముక్తపురుషుడనుకొను విషయము.

శ్లో॥ తవామృతస్యందిని పాదపంకజే। నివేశితాత్మాకథమన్యదిచ్ఛతి।
స్థితేరవిందేమకరందనిర్భరే। మధువ్రతోనేక్షురకంహివీక్షతే॥
(ఆళ్వాందారు వాక్యము.)

శ్లో॥ త్వదాశ్రితానాం జగదుద్భవస్థితి। ప్రణాశసంసార విమోచనాద
యః। భవంతిలీలా విధయశ్చవైదికా। స్త్వదీయ గంభీర మనో
నుసారిణః॥ (డిటో)

సీ. మందారమకరంద ♦ మాధుర్యమున దేలు
మధుపంబువోవునే ♦ మదనములకు
నిర్మల మందాకి ♦ నీ వీచికల దూగు
రాయంచచనునె త ♦ రంగిణులకు
లలితరసాల ప ♦ ల్లవఖాదియై చొక్కు
కోయిలసేరునే ♦ కుటజములకు
పూర్ణేందుచంద్రికా ♦ స్ఫురిత చకోరక
మరుగునే సాంద్ర నీ ♦ హారములకు
తే,గీ. నంబుజోదరుదివ్య పా ♦ దారవింద
చింతనామృతపాన వి ♦ శేషమత్త
చిత్తమేరీతి నితరుల ♦ జేరనేర్చు
వినుతగుణశీల మాటలు ♦ వేయునేల. (భాగవతము)

క. ప్రకృతికి నాకును నుదకము
నకు మత్స్యమ్మునకు బోలె ♦ నైసర్గికమై
ప్రకటంబై నది వేర్పా
టకట యహంకార వశత ♦ నదియే నంటిన్. (శాంతి.)

గీ. ప్రకృతి జేసెనే ఈ యప ♦ రాధమరయ
నాయదియకాక వేరొకం ♦ డో యనంగ
కలితుడగు నేను దానితో ♦ గలియనేల
గలిగె బహురూపములు దాన ♦ గాదె నాకు. (డిటో)

క. మమతంగాదే బహు జ
న్మములయ్యెడు దీని విడిచి ♦ నానా యోని
భ్రమణంబుల్ బాసెద న
త్యమలుడనగు నాకు ప్రకృతి ♦ యాశ్రయమేలా.

గీ. ఎన్ని రూపులు గొనివచ్చి ♦ యెట్లు పొడవు
జూపెనేనియు దానినే ♦ జూడ మమత
తో నహంకారమును గల్గు ♦ వాని జేర
నీక దోచిన ప్రకృతితో ♦ నెట్లు తోచు. (శాంతిపర్వము)



## 49. పశ్చాత్తప్తుడనుకొనవలసిన విషయము.



వ. సమస్త చేతనులను గర్భమునందున్నప్పటినుంచి రక్షించెడు స్వామీ! మనోవాక్కాయైరనాదికాల ప్రవృత్తానంతా కృత్యకరణ కృత్యాకరణ భగవదపచార భాగవతాపచారా సహ్యాపచార రూపనానా విధానంతాపచారానారబ్ధ కార్యాన్ కృతాన్క్రియ మాణాన్కరిష్యమాణాంశ్చ సర్వానశేషతః క్షమస్వ.

తా. మనోవాక్కాయములచేతను అనాదికాలము నుంచి వచ్చుచున్న యనంతములగు జేయకూడని పనులను జేయుటయును

జేయవలసిన పనుల జేయక పోవుటయును, భగవదపచారము భాగవతాపచారము అసహ్యాపచార రూపమగు వివిధములగు ననేకాపచారములను ఆరబ్ధకార్యములను చేసిన వాటిని చేయబోవు వాటిని సమస్తమును మిగులకుండు నటుల క్షమించుమా. (గద్యత్రయము.)

శ్లో॥ నధర్మనిష్ఠోస్మినచాత్మవేదీ నభక్తిమాంస్త్వచ్చరణారవిందే।
అకించనోనన్యగతిశ్శరణ్య స్త్వత్పాదమూలం శరణం ప్రపద్యే॥

శ్లో॥ అపరాధసహస్రభాజనం పతితం భీమభవార్ణవోదరే।
అగతిం శరణాగతం హరే కృపయా కేవలమాత్మసాత్కురు॥

(ఆళ్వందారు స్తోత్రము.)

అ. శాంతిపర్వములో శౌనకముని వద్దకు జనమేజయుడు బుద్ధిపూర్వక బ్రహ్మహత్యా సమపాపము బాపుకొనుటకు వెళ్లినప్పుడు ఆయన శృతపరచినది.

చ. దురితముచేసి తాపమున ♦ దూలిన నింకెటు సేయ నన్మతిం
బూరసిన ధర్మసంచరణ ♦ బుద్ధియ మేలని యూదినంగ్రియా
పరుడై మేలుచేసినను ♦ బాదము పాదముగా గ్రమంబున
న్వెరియు సమస్తముం దదభి ♦ విష్టకలంకము నిర్భయంబుగన్.

చ. నరవరవాసవుం డడిగి ♦ న న్నుదు డిట్లని చెప్పె బుద్ధితో
బూరయని పాతకంబులు స ♦ బుద్ధిక పుణ్యములు న్నశించు నం
బరమున బట్టినట్టి మల ♦ పంకముగారములోన నద్దగా
విరిసిన యట్లు నమ్మమిది ♦ వేదము చెప్పిన నేను జెప్పితిన్.

---

## 50. అవ్యక్తనామతత్వ విషయము.

---

సీ. అవ్యక్తనామకం ♦ బగు తత్వమరయ న
లింగంబు పురుషు డ ♦ లింగు డతడు
క్షేత్రంబు నెరుగుట ♦ క్షేత్రజ్ఞుడన జను
క్షేత్రంబనంగ ప్ర ♦ కృతి యనంగ

నవ్యక్తమునకు నా ♦ మాంతరములు గుణ
పరిభవమా తత్త్వమా ♦ పరిభువు గుణము
లెరుగవు చేత నా ♦ హీనముల్గాన న
త్యంతరాత్ముడు తత్కృ ♦ యా ప్రపంచ

గీ. మెరుగునట్టు లగుట ♦ యెరిగి గుణమ్ముల
విడిచి నిలిచి తత్త్వ ♦ వేది యంత
రాత్మ వేశనమున ♦ నచల నిరామయా
వ్యయ పదంబునందు♦ననఘులార. (అశ్వమేధపర్వము)

వ. క్షేత్రంబన నవ్యక్తంబనం బ్రకృతియన ప్రధానంబనం బరగు తత్త్వంబొకటియ దాని నసత్త్వంబండ్రు జీవుండాక్షేత్రంబు నెరింగెడు వాడు గావున క్షేత్రజ్ఞుడను నవ్యక్త పురంబున వసియించుటం జేసి పురుషుండన వెలుంగు క్షేత్రక్షేత్రజ్ఞులు వేరగుట ప్రస్ఫుటంబు. (శాంతిపర్వము.)

గీ. ప్రకృతివాదు లవ్యక్తంబు ♦ ప్రకృతియండ్రు
ప్రసవధర్మిణియైన యా ♦ ప్రకృతి దన్ను
బుద్ధ్యహంకారములు బంచ భూతములును
విషయములు నింద్రియములుగా ♦ విస్తరించు.

వ. పురుషునివలన నివి యెల్లనుం గలుగు పురుషుం డింతకు నధిష్ఠాతయైయుండు. 4 వ అంశముగా నుండిన ప్రకృతియు అందుల చేరికయై యుండినది.



## 51. స్వర్గనరకములు వచ్చుటను గురించి.



క. స్వర్గనరకంబు లింద్రియ
వర్గసమాచారణమున ♦ వచ్చును వినవే
స్వర్గమగు దన్నివారణ
దుర్గతియగు దన్నిరోధ ♦ దుర్బలత మెయిన్.

వ. మరియు యజ్ఞయాగాది క్రతువులును అన్నదానాదికము లు మొదలగు సుకృత కార్యములు చేయుటవలన స్వర్గంబును పంచ మహాపాతకములు మొదలగు క్రూరకార్యములు జేయుటవలన నర కంబును గలుగును.

## 52. సుఖదుఃఖముల రాకకు కారణము.

క. విను లోభము సంతోషం
బును దుఃఖ సుఖప్రదములు ♦ పురుషున కవి సం
జనితములగుట తపములే
కునికి గలుగుటను జూవె♦యుర్వీనాథా. (శాంతిపర్వము)

క. యోగంబును దపము పరి
త్యాగంబును గాక యొండు ♦ లగునె హితంబుల్
రాగము సరిదుఃఖమ్మును
త్యాగము బోలెడు సుఖంబు ♦ నరయంగలవే. శాంతి.

క. వైరాగ్యంబుపశాంతికి
కారణము ప్రశాంతి ముక్తి ♦ గను మోక్షానం
దారామ జరామృత్యువు
కేరూపున జేరనేర ♦ విద్ధచరిత్రా.

క. వ్యాప్తింబొందక వగవక
ప్రాప్తంబగు లేశమైన ♦ బదివేలనుచుం
దృప్తింజెందని మనుజుడు
సప్తద్వీపములనైన ♦ చక్కంబడునే. (భాగవతము.)

శా. ఆశాపాశము దాగడు న్నిడుపు లే ♦ దంతంబు రాజేంద్ర వా
రాశిప్రావృత మేదినీవలయ సా ♦ మ్రాజ్యంబు చేకూడియుం
గాసింబొందిరి గాక వైన్యగయ భూ ♦ కాంతాదులున్నర్థకా
మాశక్తిబాయగ నేర్చిరే మునునిజా ♦ శాంతంబులంజూచిరే.
(భాగవతము.)

సీ. సంతుష్టుడీ మూఁడు ♦ జగముల పూజ్యుండు
సంతోషి కెప్పుడు ♦ జరుగు సుఖము
సంతుష్టిగానున్న ♦ సంసార హేతువు
సంతసంబున ముక్తి ♦ సతియు దొరకు
బూటపూటకు జగం ♦ బున యదృచ్ఛాలాభ
సంతుష్టి తేజంబు ♦ తోన పెరుగు
పరితోష హీనత ♦ బ్రహ్మ జెడిపోవును
జలధార ననలంబు ♦ సమయునట్లు

గీ. నీవు రాజవనుచు ♦ నిఖిలంబు నడుగుట
తగవుగాదు నాకు ♦ దగిన కొలది
యేను వేడుకొనిన ♦ యీపదత్రయమును
చాల దనక యిమ్ము ♦ చాలుచాలు. (భాగవతము.)

గీ. తనువు జరనొంద జీర్ణించు ♦ దంత కేశ
సముదయము జీవితాశయు ♦ స్వర్ణమందు
దగులు నాశయు జీర్ణింప ♦ కొగి స్ఫుటత్వ
మొందు దానిని వదలిన ♦ నొందు సుఖము.
(బ్రహ్మాండ పురాణము.)



## 53. చిత్తవృత్తి ప్రసరించు కారణము.



శ్లో॥ యదాప్రస్పందతే ప్రాణో నాడీసంస్పర్శనోద్యతః ।
తదాసంవేదనమయం చిత్తమాశుప్రజాయతే॥

తా. ఎప్పుడు ఈ ప్రాణవాయువు నాడుల మనోవహంబు లనుసరించి సంచరింప నుద్యుక్తంబై కదలెడినో అప్పుడు చిత్తంబు త్వరగా వృత్తిజ్ఞాన ప్రచురంబగును. (వాశిష్ఠ రామాయణము.)



## 54. దేహికర్మంబు జేయుటకు మూలకారణము.

గీ. కోరి కర్మంబు నడిపెడి ♦ వారికెల్ల
గలిత శుభములు నశుభము ♦ ల్గలుగుచుండు
నరయగా దేహి గుణసంగి ♦ యైన యపుడె
పూని కర్మంబు సేయక ♦ మానరాదు. (భాగవతము)
(అజామిళోపాఖ్యానము.)

## 55. పురుషుడు చెడిపోవు విధము.

గీ. మించురాగమ్మునను బ్రీతి ♦ వించు గ్రోధ
మందు వలనను లోభమా ♦ నందు మోహ
మందు స్మృతి విభ్రమంబగు ♦ నందువలన
బుద్ధి నశియించు దానిచే ♦ పురుషుడణగు.
(మార్కండేయ పురాణము.)

## 56. కులాచార విషయము.

తే. బ్రాహ్మణ క్షత్రియులు వైశ్య ♦ పాదభవులు
స్వకుల ధర్మతత్పరులై ♦ వాసుదేవు
నొనర నర్చింపగాదగు ♦ నొండు విధము
నను దదారాధనముసేయ ♦ ననువు గాదు.
(విష్ణుపురాణము.)

తే. స్వకుల విహిత సదాచార ♦ వంతుడైన
పురుషుడు జనార్దను పరమ ♦ పురుషు నవ్య
యాత్ము నారాధితుని జేయు ♦ నగును నన్య
చిత్తుడై వాంఛితార్థ సం ♦ సిద్ధి నెందు (డిటో.)

తే. వృత్తవంతుడు వెండియు ♦ వివిధగతుల
విత్తవంతుడుగానేర్చు ♦ వృత్తహీను
డైన వాడు విహీనుండ ♦ యండ్రు గాన
విత్తరక్షకు గడుమేలు ♦ వృత్తరక్ష. (అరణ్యపర్వము.)

గీ. అనఘు డాచార మాయువు ♦ బెనుచు నదియ
కాదు శ్రీయును కీర్తియు ♦ నలుగ జేయు
విను దురాచారు డాయువు ♦ పెనుపు పొంద
డతని నఖిల భూతంబులు ♦ నభిభవించు.

క. కావున నాచార పరత
భూవరమేల్ సాధుజనులు ♦ వోవు తెరవు సం
భావించుట యాచారము
దావర్ణాశ్రమననుర♦తం బరగున్నృపా. అనుశాసనికము.

క. వర్ణాశ్రమ ధర్మంబుల
నిర్ణయమును వదిలి వేద ♦ నిందకు లైదు
ర్వర్ణుల గూడిన వారల
వర్ణనమిపుడేలపుత్ర♦దారలయోగుల్. బ్రహ్మాండపురాణం

చ. అనుటయు నాతడిట్టులను ♦ నక్కురు భర్తకు వేగమేటికిన్
ఘనభుజ యెల్లచందములు ♦ గాలము తోడివచుమ్ము వర్ణ ధ
ర్మనిరతి చిత్తపాకము క్రి ♦ మంబున దెచ్చు కషాయ పక్వతం
బనుపడ కర్షు డేలగు నృ ♦ పాల కుమారుడు సన్యసింపగన్.

శ్లో॥ సహజం కర్మ కౌంతేయ సదోషమపినత్యజేత్
సర్వారంభాహి దోషేణధూమేనాగ్నిరివావృతాః॥

తా. తన జాతికి సహజ సిద్ధంబైన కర్మదోషముండినను దానిని త్యజింపరాదు అగ్నిని పొగ చుట్టుకొని యుండు రీతిగా సమస్త కర్మలును దోషముచేత నావరింపబడి యుండును.

(భగవద్గీత మోక్షసన్యాస యోగము.)

57. సర్వవర్ణములు ఆచరించవలసిన యాచారములు.



క. పరధన పరదారంబుల
హరియింపమి దేవ పితృ స ♦ మారాధనముఁ
గరుణయు నతిథిసపర్యయు
గిరితనయా యెల్లవారి ♦ కిఁ గృత్యంబుల్.

ఆ. అన్యమాంసమున ని ♦ జాంగ మాంసమ్ము బో
షింతు ననుటకంటె ♦ చెడ్డ లేదు
మాంసభక్షణంబు ♦ మానుటకంటెను
మేలు లేదు కర్మ ♦ జాలకమున. (భాగవతము.)

గీ. వినుము దానంబు తపమును ♦ వృద్ధసేవ
నము నహింసయు నియత కృ ♦ త్యములు సర్వ
జనులకు మహాగుణమ్ములు ♦ మనమునందు
ధృఢముగా నిల్పి నడుపుము ♦ ధీరవర్య.

క. విమలాత్మ యహింసయు దా
నము సత్యము క్రోధవర్జ ♦ నంబును వినుము
త్తమ ధర్మరాశి యిది ధ
ర్మమునకు బరసీమ దీని ♦ మరుపుము మదికిఁ.

(భారతము.)

క. ఇనుమును కనకము నిందయు
వినుతియు సమములుగ గనుచు ♦ వివిధాంగకముల్
తనలోన నడచుకమఠము
ననువున నింద్రియములడచు ♦ నతడు శివుగనుఁ.

క. కులమును విద్యయు వృత్తము
నమలమతీ యన్నమిడుట ♦ కై యడుగంగా
వలవదు విప్రుని నాదర
మలరంగానిడుట లెస్స ♦ యడిగినమాత్రఁ. అనుశాసనీకం.

క. కోరిక నొల్లమి లేకయు
నేరూపున భూతములకు ♦ నెగ్గగు తెరగుం
జేరక యకామవృత్తి త
పోరతి నున్నతఁడు బ్రహ్మ ♦ ముఁ బ్రాపించున్.

గీ. సర్వవర్ణాశ్రమములకు ♦ శమముదమము
గలిగి యునికి విశిష్టప్ర ♦ కారమగుట
బ్రాహ్మణునకు విశేషించి ♦ రాజవర్య
దమ సమాహిత వృత్తి పె ♦ ద్దయును వలయు.

క. సమదర్శియై యఖిల భూ
తములను దనయట్లగాఁగ ♦ దలఁచును నెవ్వం
డమల న్యాయపరుండగు
నమరు లతని వందనీయు ♦ డండ్రు నరేంద్రా.

గీ. పాప మించుక దొడరెడి ♦ ఘనుల నెట్టి
ఫలము గలిగిన వలదల్ప ♦ పలవిధాయి
యైన పుణ్యమిశ్రిత కార్య ♦ మాచరించు
నది శివంబగు దానని ♦ హాముష్మ బరము.

క. మనసును వాక్కును రక్షణ
బనుపడు నెవ్వనికి శ్రుతి త ♦ పస్త్యాగము లా
తని చేతిలోనివగునని
మునిజనములచేత విందు ♦ ము నిరంతరమున్.

గీ. బ్రహ్మచర్యంబు కంటెను ♦ బరము మద్య
మాంసములు రెండు నుడుగుట ♦ మనుజనాథ
లోకయాత్రలు పాటించు ♦ లోలు సత్వ
శమము గలిగి వర్తించుట ♦ శౌచవిధము.

క. మొదలు జలమిడిన భూజము
దుది నడుమను జల్లదనము ♦ దొరకొనుమాడ్కిన్

న్మోదలను హారికిని మొక్కిన
ముదమొందుదు మెల్లవేల్పు ♦ మూకలు పేర్మిన్.
(భాగవతము.)

క. పరహితము సేయు నెవ్వడు
పరమ హితుండగును భూత ♦ పంచకమునకున్
పరహితమె పరమ ధర్మము
పరహితునకు నెదురులేదు♦పర్వేందుముఖీ. భాగవతము.

గీ. దారరక్షణంబు ♦ దగును దివాస్వప్న
మైథునములు నీర్ష్య ♦ మానవలయు
పరుల మదికి తాప ♦ కరమైన కర్మము
జంతు పీడజేయు ♦ జనము పుత్రా. మార్కండేయము.

గీ. సర్వవర్ణములందు నా ♦ శ్రమములందు
నున్న సామాన్య ధర్మంబు ♦ లుగ్గడింతు
సత్యమును శౌచమును సహిం ♦ సయు ననూయ
లేమి క్షయము నృశంస్యము ♦ ల్వినుము మరియు.

క. దీనత్వము లేమియు నిజ
మానస సంతోషమును స ♦ మంజసగుణ సం
తానం బీయష్టకమిల
మానవ మాత్రునకు గలిగి ♦ మనుటొప్పు సుతా.

---

## ౫౮. ధర్మముల విషయమును గురించి.

---

క. మైత్రిం బోలెడు ధర్మము
ధాత్రీ దివిజులకు లేదు ♦ దాని నడపినన్
బుత్రా యేకర్మంబు ప
విత్రతయును వలవదని వి ♦ వేకము జేర్చున్.

సీ. దానంబు సత్యంబు ♦ దపము యజ్ఞము నార్జ
వము కామలోభాది ♦ వర్జనంబు
గురుజన శుశ్రూష ♦ క్రోధరాహిత్యంబు
దమము సంతోష మ ♦ ధ్యయన నిరతి
డాంబికత్వములేమి ♦ దైన్యంబువోరయుమి
యనసూయ యనహంక్రి ♦ యాభియుక్త
దలపంగ నాద్యమై ♦ తనరు ధర్మము నెప్డు
గాని యాటనాస్తిక ♦ గోష్ఠి జనమి

గీ. శీలసంరక్షతీర్థ సం ♦ సేవ శౌచ
మఖిల భూతములందు ద ♦ యార్ద్రడగుట
మితహితోక్తులు సంశ్రిత ♦ మిత్రగుప్తి
యిన్నియును శిష్టచరితంబు ♦ లిద్ధచరిత.

క. కోపంబు లేమి సత్యా
లాపము నిజదార పరవి ♦ లాసము శుచితో
గోప సమగ్రాహింబవ
నీపాలక సర్వవర్ణ ♦ నియుత గుణంబుల్.

గీ. జంతుపదములెల్ల ♦ దంతిపదంబులో
నడగు క్రియ యహింస ♦ యందు సకల
ధర్మములు నడంగు ♦ కర్మ సంత్యాగికి
నైన భూతదయ స ♦ మగ్రగుణము.

క. కొందరు కర్మ కరణ మభి
నందింతురు వారలకు జ ♦ నన మరణంబుల్
పొందక పోరాదు మహా
నందము బొందుదురు నిత్య ♦ నైష్కర్మ్యపరుల్.

గీ. తిరిసియేనియు నన్నంబు ♦ దెచ్చి యతిథు
లైన విప్రుల యాకలి ♦ యపహరించు

బురుషు డూర్ధ్వలోకమ్మున ♦ బురుషవరుల
కర్చనీయుడై వెలుగుచు♦నందయుండు. అనుశాసనికము.

గీ. దినము సంధ్యంబుగాకుండ ♦ దివిరి యన్న
పానదానంబు లొదవిన ♦ భంగిజేసి
మంచిభూ చుట బోలెడు ♦ మహిత ధర్మ
కార్య మొండొకటెందును ♦ గలదె యరయ.

గీ. నిరయమునకు ప్రాప్తి ♦ నిగ్రహంబునకును
పదవిహీనతకు ని ♦ బంధమునకు
సర్వభంగమునకు ♦ నఖిల దుఃఖములకు
వెరవ దేవ! బొంక♦వెరచినట్లు. (భాగవతము.)

క. మనసున వాక్కున గాయం
బున నెవ్వడు సర్వభూత ♦ ములయందు శుభం
బొనగూడ దలచు నాతడె
వినుడీ జ్ఞానమ్ము నొందు ♦ విగత భయుండై.
(బ్రహ్మాండపురాణము ఉపోద్ఘాతపాదము.)

క. పరులకు భీతిల జేయక
పరులవలన భీతినొంది ♦ పారక కామో
ద్ధురుతం బొందక ద్వేష
స్ఫురణము నొందని యతండు ♦ పొందును ముక్తిన్.
(బ్రహ్మాండపురాణము.)

ఉ. కామము భోగయోగమున ♦ గాంచదు తృప్తి నికేమియన్నను
ద్దాము గతింజెలంగు నిది ♦ తథ్యము వహ్నిహావిః ప్రధానతన్
దామహింశాంతి నొందునె ని♦తాంతము వృద్ధినిబొందుగాక యిం
కేమి యొనర్చినన్ జెడదు♦హీనమగున్ గదుయోర్చియుండినన్.
(బ్రహ్మాండపురాణము.)

మ. తను నిందించిన గొట్టియున్ క్షమయె స్వ ♦ ద్రవ్యంబుగాగల్గు న
మ్మునులాశారహితుల్ సుశాంత మనసుల్ ♦ మోదంబునేకాంతు ర

య్యనఘుల్ ప్రత్యపకారముం దలపక ♦ త్యంతక్షమావంతులై
పునరావృత్తి విహీనమౌ పదమునే ♦ పొందంగనుందుర్ గదున్

తే. ఎవడు దుష్టులచే నతి ♦ హీన వాక్య
ములను దండాది తాడనం ♦ బులును బొంది
యును మదిఁ క్షోభ మొందక ♦ యుండు నతఁడె
సాధువనబడు వానికే ♦ సౌఖ్యమబ్బు.

క. దండించిన వానిని ప్రతి
దండనమును బొందజేయు ♦ దౌర్భాగ్యుఁడు భూ
మండలమున దగు బాపా
త్ముండని జెప్పంగ దాన ♦ దొసగులు పొసగున్.

తే. శ్రాద్ధములచేత పితరులా ♦ రాధితులయి
సోము సంతోషపరతురు ♦ సోముఁడలరి
యెల్లలోకంబులను బ్రీతి ♦ యెసగ వృద్ధి
బొందజేసెను వారు స ♦ త్పురుషచంద్ర.

చ. పితరులకెల్ల సోముఁడును ♦ విరుసు మెటియునై చెలంగు న
ప్రతిమ గుణాఢ్యు నాతనిని ♦ శ్రాద్ధవిధిం బరితృప్తిజేయ నీ
క్షితిగల సర్వభూతముల ♦ జేతనయుక్తిని బొందజేయుచున్
సతతము వృద్ధిజేయు దరు ♦ జాతము దీగెల నాతడెంతయున్.

(బ్రహ్మాండపురాణము.)

గాన, చెట్టునాటిలి యొక్క పలుదోషము ఫుల్ల వివరించి [illegible] పెంచిన బిడ్డను గిల్లివట్టుఫలము.

తే. తెపములెన్నొ విధంబుల ♦ విసరు వాని
యందు చూడంగ యోగంబె ♦ యుత్తము [illegible]
యగుచు గావున బరమేశ్వ ♦ ధ్యానయోగ
సక్తి నవనాశ్రి [illegible] చె [illegible] నగుబుధను.

గీ. బ్రహ్మచర్య ను [illegible] ♦ [illegible] నగు [illegible]
ధర్మములు [illegible] ♦ త్తను [illegible]

దాని గలవాఁడు నిర్మల ♦ జ్ఞానయోగ
వంతుఁడై చూడనేర్చు స ♦ ర్వంబు ననఘ. (శాంతి.)

క. ఒరులేయవి యొనరించిన
నరవరయ ప్రియము దన మ ♦ నంబునకగు దా
నొరులకు నవి చేయకునికి
పారాయణము పరమ ధర్మ ♦ పథముల కెల్లన్.

క. క్షమయును సత్యంబును శౌ
చమును సుధర్మములు బ్రహ్మ ♦ చర్యం బత్యు
త్తమ ధర్మము వానికి జి
త్తమునలవఱుపంగవలయు ♦ ధైర్యము పేర్మిన్.

గీ. అన్నమైన దోయ ♦ మైన ద్రవ్యమయిన
శాకమయిన దనకు ♦ జరుగు కొలది
యతిథి జనుల కడ్డ ♦ మాడక యిడలేని
లేమ వారు పుడమి ♦ లేనివారు. (భాగవతము.)

---

## 59. వృక్ష విషయ ధర్మము.

---

క. ఇల బక్షుల కాశ్రయమై
ఫలియించెడి తరువునరుకు ♦ పాపాత్ములు సం
కెలలబడి ఘోరనరకా
గ్నుల గూలరె యముని భటులు ♦ కొరవులజూడన్.
(పద్మపురాణము.)

వ. గాన, యజ్ఞమందు మాత్రము పశువును బట్టవలయును సంతర్పణలయందు వంటచెరకు నిమిత్తము మాత్రమే చెట్లుగొట్టవలయును స్వకార్యములకు పుష్పగాని విరువకూడదు.

---

## 60. ఏకాంతిక ధర్మ ప్రకారంబు.

వ. అనిన విని జనమేజయుండు వైశంపాయనునితో నేకాంతికజనంబులు లోకోత్తరులనిచెప్పి తద్యేకాంతికత్వం బెట్టిది. ఎరింగింపవే యనుటయు నతండతని కిట్లనియె.

గీ. సాంఖ్యయోగ పరమ ♦ సార భూతంబిది
మున్నువింటి యుద్ధ ♦ మునకు జొరక
కరుణ నార్జునుండైన ♦ గాండివి బోధింప
కృష్ణు జెప్పినట్టి ♦ గీతలందు.

క. నిర్మలమగు నైకాంతిక
ధర్మము నారాయణోది ♦ తంబై క్రియలం
గర్మఠుడగు బ్రహ్మమతని
ధార్మికవర యొలసె నతడు ♦ దయ జగురోత్తా.

క. దక్షునకు నెరింగించిన
దక్షుడు బోధించె దనదు ♦ దౌహిత్రు జగ
చ్చక్షుని కాసవిత్రుండు మ
ను క్షితిపతికిచ్చె నవ్వి ♦ నుత ధర్మంబుల్.

క. మనువిక్ష్వాకున కొసగె న
తనివలన దదీయ యోగ్య ♦ తాకలితులు స
జ్జనములు వడసి రనేకులు
విను నారాయణునిచేత ♦ విని నారదుడున్.

క. తగియెడు శిష్యుల కొసగెను
జగతీశ్వర యిట్లతి ప్ర ♦ శస్తంబై యి
జ్జగములను గలిగె వినుమ
య్యాగాధ ధర్మంబు దుష్కృ ♦ తా ప్రాప్యంబున్.

క. దానికపుంసమె మూలము
దానన హరిప్రీతుడగు న ♦ తండన ధరణీ

జానీ క్షేత్రజ్ఞుం డన
గా నొక్కఁడ యగుట దెలియ గావలయు నగన్.

క. ఏకద్విత్రి చతుర్వ్యూ
హాకారంబ దొమమున్యుఁ ♦ హరిభక్తజనా
లోకనమ్ము వాసుదేవో
ద్యోగప్రాప్తముగ దత్త ♦ దుచితస్ఫూర్తిన్.

క. వాసుదేవుఁడు ప్రథమము ♦ వసుమతిక
మొలిసంకర్షణుఁడు ప్ర ♦ ద్యుమ్నుఁడని ద్వి
తీయకంబు తృతీయంబు ♦ తెల్లమచ్చ
తుర్థమని రుద్ధుఁడిట్లు చ ♦ తుర్విధములు.

క. ఈ నెలవులఁ దొమను హరి
తానొక్కఁడ యింద్రియ ప్ర ♦ తతికందందే
కానూనభక్తి కగుపను
దానికి దపమును శమంబు ♦ దమమును గుణములున్.

క. శాంతి ప్రతిష్ఠునకు నే
కాంతిక ధర్మంబు కరత ♦ లామలకము గన్
జంతాంతంతు తృటనా
త్యంత విదగ్ధంబు సూనె ♦ యని మనుజేంద్రా.

---

## 61. సకల జనులకు సనాతన ధర్మము.

---

వ. నారదుండు ధర్మరాజునకు వర్ణాశ్రమ ధర్మనిర్ణయంబుప దేసించుటలో ధర్మరూప మఖిలంబు నెరింగింపు. వినగ నిచ్చగలను విమలచరిత యనిన నారదుండు ధర్మరాజుం జూచి దాక్షాయణి యందు నిజాంశంబున జన్మించి భువనశోభనంబు కొరకు బదరికాశ్ర మంబున తపోనిరతుండైయున్న నారాయణునివలన సనాతన ధర్మం

బువింటి నది సెప్పిద సకల వర్ణంబుల జనులకు సత్యంబును దయయు నుపవాసాది తపంబును శౌచంబులును స్థైరణయు సదసద్వివేకంబును మనోనియమంబును బహిరింద్రియజయంబును హింసలేమియు బ్రహ్మచర్యంబును దానంబును యథోచిత జపంబును సంతోషంబును మార్దవంబును సమదర్శనంబును మహాజనసేవయు గ్రామ్యంబులైన కోరికలు మానుటయు నిష్ఫల క్రియలు విడుచుటయు మితభాషిత్వంబును దేహంబుగాని తన్ను వెదకికొనుటయు నన్నోదకంబులు ప్రాణులకుంబంచి యిచ్చుటయు ప్రాణులయందు దేవతాబుద్ధియు నాత్మబుద్ధింజేయుటయు శ్రీనారాయణ స్మరణ కీర్తన శ్రవణసేవార్చన నమస్కారదాస్యాత్మ సమర్పణ సఖ్యంబు లనియెడి త్రింశల్లక్షణంబులు గలిగి విధిచోదిత ప్రకారము చతురాశ్రమములు జరిపి ముక్తినొందుట.

---

## 62. భాగవత ధర్మము.

---

క. వర్ణాశ్రమ ధర్మంబులు
నిర్ణయ కర్మముల జెడక ♦ నిఖిల జగత్సం
పూర్ణుడు హరియను నాతడె
వర్ణింపగ భాగవతుడు ♦ వసుధాధీశా.

---

## 63. పరస్త్రీలయందు పరద్రవ్యములయందు సకలభూతములయందు పురుషుల కుండవలసిన భావనావిషయము.

---

సీ. తనయందు నిఖిల భూ ♦ తములందు నొకభంగి
సమహితత్వంబును ♦ జరుపువాడు
పెద్దల బొడగన్న ♦ భృత్యుని కైవడి
జేరి నమస్కృతుల్ ♦ సేయువాడు

కన్నుదోయికి నన్య ♦ కాంతలడ్డంబైన
మాతృభావము జేసి ♦ మరలువాడు
తల్లిదండ్రుల భంగి ♦ ధర్మవత్సలతను
దీనులగావ జిం ♦ తించువాడు

గీ. సఖులయెడ సోదర స్థితి ♦ జరుపువాడు
దైవతములంచు గురువుల ♦ దలచువాడు
లీలలందును బొంకులు ♦ లేనివాడు
లలిత మర్యాదుడైన పు ♦ ష్టోడు డధిప.

శ్లో॥ మాతృవత్పరదారాంశ్చ పరద్రవ్యాణిలోష్టవత్ ।
ఆత్మవత్సర్వభూతాని యఃపశ్యతిసపశ్యతి॥

## 64. ధర్మార్థకామముల తారతమ్యము.

వ. వినోదగోష్ఠినుండి విదురునిం దమ్ముల నుపలక్షించి ధర్మార్థకామంబులయం దుత్తమ మధ్యమాధమత్వనిరూపణంబు సేయుడు చూతమని పల్కిన నవ్విభునకు విదురుం డిట్లనియె.

క. విను ధర్మంబున ధనమగు
ధనమున సిద్ధించు గామ ♦ తంత్రంబటు గా
వున మధ్యమంబు నధమము
ధనకామము లుత్తమంబు ♦ ధర్మంబధిపా.

## 65. పాతివ్రత్య ధర్మము.

క. సవతాలికి బతివలచి న
నవుగాకని యుతని యిచ్చ ♦ కనురూపముగా
దివిరి నడచు సతి దైవము
శివయుది తగునెల్ల జనము ♦ చే మ్రొక్కగొనన్.

గీ. ఎఱుక గలిగి పిదప ♦ నేనియు పతి భక్తి
గలిగి ధర్మమోపి ♦ సలిపి శాంతి
గలిగియున్న మున్ను ♦ గల పాపములువాసి
పురుషుతోడ దివికి ♦ బోవగండ్రు.

క. ఉపవాసంబులు వ్రతములు
దపములు వెయ్యేల భర్త ♦ దైవతమని ని
ష్కపటత గొల్చిన సాధ్వికి
నృపవర దుర్లభము లేదు♦నిఖిలజగములన్. భాగవతము.

సీ. నిలయము వాటించి ♦ నిర్మల దేహయై
శృంగార మేపార్ప ♦ జేయవలయు
సత్యక్రియాలాప ♦ చతురయై ప్రాణేశు
చిత్తంబు ప్రేమ రం ♦ జింపవలయు
దాక్షిణ్య సంతోష ♦ ధర్మ మేధాదుల
దైవతమని ప్రియు ♦ దలపవలయు
నాథుడేపద్ధతి ♦ నడచు నాపద్ధతి
నడచి సద్బంధుల ♦ నడుపవలయు

గీ. మార్దవమున బతికి ♦ మజ్జనభోజన
శయనపాన రతుల ♦ జరుపవలయు
విభుడు పతితుడైన ♦ వెలది పాతివ్రత్య
మహిమ బుణ్యుజేసి ♦ మనుపవలయు. భాగవతము.

క. తరుణి తన ప్రాణవల్లభు
హరి భావమ్మున భజించి ♦ యతడును దానున్
సిరికైవడి వర్తించును
హరి లోకము నొందు సంత ♦ తానందంబున్.

శ్లో॥ కార్యేషుదాసీ కరణేషుమంత్రీ రూపేచ లక్ష్మీః క్షమయాధరిత్రీ।
భోజ్యేషుమాతా శయనేషురంభా షట్కర్మయుక్తా కులధర్మపత్నీ॥

## 66. పతివ్రతామాహాత్మ్యము-మార్కండేయ పురాణము.

సీ. కౌశికుండను పేర ♦ గలడు మున్నొక్క వి
ప్రుండు ప్రతిష్ఠాన ♦ పురమునందు
నాతండు జన్మాంత ♦ రాఘంబువలన కు
ష్ఠవ్యాధి పీడిత ♦ సకలగాత్రు
డాతని భార్య మ ♦ హా పతివ్రత పతిఁ
దేవునివలె భక్తి ♦ సేవ జేయు
పాదసంవాహన ♦ ప్రక్షాళన స్నాన
భోజనాచ్ఛాదన ♦ పూర్వకముల

గీ. శ్లేష్మమూత్రమలవ్రణా ♦ సృక్ప్రవాహ
మార్జనక్షాళనాదుల ♦ మంజువచన
రచనల రహస్య సంప్రీతి ♦ రంజనోప
చారములచేత నర్చించు ♦ సంతతమును.

క. ఇటులర్చించుచు నుండిన
జటుల క్రోధుం డతండు ♦ సతినివినీతఁ
కటుతరవాక్యంబులచే
బటుపటయన పండ్లుగొరికి ♦ భర్జనసేయుః.

క. ఏమన్నను కోపింపక
తామన్ననతోడ తనదు ♦ దైవతమనియుఁ
దామెయి నతిభీభత్సుని
సీమంతిని దలచు నతని ♦ శ్రేష్ఠునిగాగః.

సీ. ఇటులున్న నొక్కనా ♦ డింతితో కౌశికుం
డిట్లనె సాధ్వినే ♦ నించుకైన
సంచరించగలేను ♦ చారువయోరూప
లావణ్యముల నొప్పు ♦ లలితగాత్రి

యొక వేశ్య నేనింట ♦ నుండగ నీవీధి
జనుచు దటాలున ♦ కనులబడితె
నది మొదల్ గాగ నా ♦ మదవతి నామది
బొదలుచున్నది దాని ♦ వదల వశమె

గీ. చారుపీనపయోధర ♦ చటులనయన
నిమ్ననాభి పృథుశ్రోణి ♦ నీలవేణి
ఇట్టి సర్వాంగ సుందరి ♦ నెనయకున్న
మృతుని నను గాంతు వఖిలజ్ఞ ♦ పతివ వినుము.

క. కాముడు త్రైలోక్యమునకు
వాముండటుగాన దాని ♦ వయసుంగనినన్
వేమంది వెంట దిరుగుదు
రామానినిగూర్పుమి పుడ ♦ యతిరయమొప్పన్.

క. ప్రాతఃకాలమునను నే
నాతరుణిన్ గంటి నిప్పు ♦ డయ్యెను నిశనీ
వా తెరవ గృహంబున కిపు
డేతగగొని పొమ్ము లెమ్ము ♦ డెందంబలరన్.

క. దానిని బొందక యున్నన్
మానిని బ్రతుకంగ వశమె ♦ మరియెవ్వరికిన్
దానికడను జనసంకుల
మైనదిగా దోచుచుండె ♦ డె నాసక్తి సతీ.

మ. అలకామాతురుడైన భర్త వచనం ♦ బాలించి యాసాధ్వి స
త్కుల సంజాత మహాపతివ్రత కటిన్ ♦ కోకన్ బిగన్ గట్టి సా
మ్ములు శుల్కార్థము లెల్లగట్టి ప్రియునిన్ ♦ మూపెక్కగా జేసి మి
న్నులమన్ మేఘముల త్తమంబున దటి ♦ ద్వ్యక్తాగ్రరథ్యన్ జనెన్.

గీ. అంధకారంబు బంధుర ♦ మగుచునుండ
రాజమార్గంబులోన నా ♦ రజనియందు

బతిప్రియము సేయు బుద్ధి న ♦ య్యతివ మిగుల
మందగతి బోవుచుండ న ♦ మ్మార్గమందు.

క. చోరాపదేశమున నతి
దారుణమగు శూలమందు ♦ దగిలించిరి దు
ర్వారభటులు నిత్య తప
స్సారుఁ మాండవ్యమౌని ♦ సత్తమునిపురిఁ.

శా. నారిస్కంధమునఁ వసించి జనునం ♦ తఁ విప్రపాదంబు శూ
లారూఢుండగు మౌనికిఁ వ్యధకరం ♦ బై దారువుండాక నా
ఘోరంబై దగు వేదనఁ గొనుట స ♦ క్రోధాత్ముడై మౌని దు
ర్వారోగ్రంబగు శాపమిచ్చెనట ద్యా ♦ వాభూములల్లాడఁగఁ.

వ. అది యెట్లనిన.

గీ. కొరతకొయ్యయందు ♦ ఘోరంబుగా గ్రుచ్చ
బడి మహాశ్రమంబు ♦ పాలుబడుచు
నున్న నన్ను గదిపి ♦ యుడికించె నెవ్వాడు
వాడు జచ్చు నినుడు ♦ వచ్చునపుడు.

క. రవికాంతి జూచినపుడ త
డవశుండై జచ్చుగాక ♦ యని శపియింపఁ
ధవునకగు శాపమును విని
యువిద బలికె సూర్యుడుదయ ♦ మొందడటంచుఁ.

గీ. ఆ పతివ్రత సూర్యోద ♦ యంబుగాక
యుండబలికిన నుదయించ ♦ కుండె తపను
డంత బహురాత్రు లొక్కటై ♦ యంధకార
మగ్నమై యుండె జగములు ♦ మాయదొడగె.

ఉ. దేవతలెల్ల భీతిలి మ ♦ దిఁ దలపోసిరి వేదపాఠముల్
లేవు వషట్కృతుల్ మడిసె ♦ లీనములయ్యెను దైవపైత్ర కా

ర్యావళి యీజగంబికల ♦ యంబును బొందక యుండు టెట్టులో
కావున రాత్రియుంబవలు ♦ గల్గక యుండిన నిల్వవచ్చునే.

గీ. వసుధలో దివారాత్రి వ్య ♦ వస్థలేక
నగునె మాసర్తు విజ్ఞాన ♦ మదియు లేక
దక్షిణోత్తరాయణములు ♦ దనరుటెట్టు
లవి దనరకున్న వత్సర ♦ మగుట గలదె.

సీ. వత్సరజ్ఞానంబు ♦ వర్తిలకుండిన
నితర కాలజ్ఞాన ♦ మెట్లు గలుగు
నలపతివ్రత బల్కు ♦ బలమున భాస్కరు
డుదయింపకుండె ని ♦ ట్లు ♦ న్న స్నాన
దానాది సత్కృతుల్ ♦ దప్పిపోవును మరి
యగ్నిహోత్రాదులు ♦ నణగు నందు
వలనను మనకింక ♦ గలుగ దాప్యాయనం
బాప్యాయితులమైన నంబువృష్టి

గీ. గలుగ జేతుము దాననే ♦ గద ఫలించు
నోషధులు సస్యముల ఫల ♦ మొంది నరులు
హవ్యముల మనకిచ్చెద ♦ రధ్వరముల
నర్చితులమయి గావింతు ♦ మభిమతములు.

సీ. వసుధ నరుల్ హవి ♦ ర్వర్షంబుచే నూర్ధ్వ
వర్షులౌదురు జల ♦ వర్షమునను
మనమధోవర్షుల ♦ మనబడుదుము నిత్య
నైమిత్తికములనే ♦ నరులు మనకు
సంతుష్టి జేసెదు ♦ జన్నంబులను మాని
వారె భుజింతురు ♦ వారిదుష్ట
బుద్ధుల నాశంబు ♦ బొందింప క్షితిజలా
నలవాయువుల నతి ♦ కలుషములుగ

ల్లేయని సురలత్రి ముని
పేర్మియసిగని వేడుకొనిరి ♦ బీతి దలిర్పన్.

చ. అమరులు వేడుకొన్న నపు ♦ డత్రిమహాముని భార్య సుప్రసా
దమహితయై భవద్హితము ♦ తప్పక జేసెద జెప్పుమన్న పూ
ర్వమువలె రాత్రియుంబవలు ♦ వచ్చుచు బోవుచు నుండునట్లు జే
యుమనుడు సాధ్వియిట్లనియె ♦ నోసురలార వినుండు జెప్పెదన్.

మ. సతిమాహాత్మ్యమనల్ప మెట్టులగునో ♦ సాధ్వీ ప్రదంబరా
నతిసమ్మానితజేసి సేవవలురా ♦ నర్థించి గావింతునే
స్థితిమున్నుండె నహన్నిశాగతులు త ♦ ద్రీతిన్ దగన్ జేతు త
త్పతిపంచత్వము బాపి జీవితునిగా ♦ బాటింతునంచున్ వడిన్.

చ. అని యిటుబల్కి సాధ్వి సుర ♦ లందరు రాసతి భవ్యమందిరం
బునకు జటాలునన్ జని వి ♦ భున్ పరిచర్యల దన్పుచున్న సా
ధ్విని గని క్షేమమారసి స ♦ తీ నిజధర్మము భర్తృధర్మమున్
దనరును గాదె విఘ్నములు ♦ దాకక యుండును గాదె సుందరీ

వ. అని మరియు నయ్యనసూయాదేవి కౌశికపత్ని కిట్లనియె

క. పతిమోముగాంచి నప్పుడు
మతిముదమును గాంతుగాదె ♦ మాన్యతచే దే
వతలందరి కంటెను నీ
పతి నెక్కుడుగాగ దలతె ♦ భవ్యచరిత్రా.

సీ. భర్తృశుశ్రూషణ ♦ పరతచే నాకు మ
హాఫలం బిటుల సం ♦ ప్రాప్తమయ్యె
నంగన సర్వకా ♦ మ్య ఫలంబు సిద్ధించు
సుపథమా భర్తృ శు ♦ శ్రూషవలన
పంచఋణములు దీర్చ ♦ బడవలె నరునిచే
నాత్మవర్ణోచిత ♦ మయిన ధర్మ

మున నె! గూర్పగవలె ♦ ధనసంచయంబు నా
ధనమును సత్పాత్ర ♦ మున నె వ్యయము

గీ. సలుపవలయు శక్తి ♦ కొలదిగ సత్తపో
దానధర్మశౌచ ♦ దయలు నార్జ
వంబు గలిగినియతి ♦ వర్తింపవలె నింక
వినుము చెప్పెదను వివేకమలర.

సీ. శాస్త్రనిర్దిష్ట ప్రశస్త కర్మములను
రాగవిద్వేష వ ♦ ర్జనముగాగ
దన శక్తికొలది శ్రద్ధాపురస్కృతిగాగ
ప్రతిదిన మాచరిం ♦ పంగవలయు
వినునరుల్ నిజజాతి విహితలోకముల బ్రా
జాపత్యముఖముల ♦ జాలక్లేశ
ములబొందు దురుశ్రమం ♦ బున నిట్టు బురుషుల
చేత గష్టమున నా ♦ ర్జింపబడిన

గీ. సకల పుణ్యంబులందును ♦ సగము వనిత
లొందుదురు పతిశుశ్రూష ♦ యొప్ప జేసి
శ్రాద్ధముపవాసములు వేర ♦ జన్నములును
లేక వసియింతురీప్సిత ♦ లోకములను.

క. సతి యటుల గాన నీవా
బతిశుశ్రూషణమునందు ♦ బరతగలిగి స
మ్మతివర్తింతువుగాదే
పతియే పరమ గతి గాన ♦ భామల కెల్లన్.

క. సురలకు బితౄదులకున్
పురుషుం డొనరించు నట్టి ♦ పూజామలలో
వరశుశ్రూషన్ సతి త
త్పరత ననన్యాత్మమైన ♦ దాసగము గొనున్.

సీ. అనసూయ పల్కు లత్యాదరంబున విని
సంభావనము జేసి సాధ్వి తనిసి
యత్రిపత్నికి నిట్టు లనియె నో ప్రకృతి క
ల్యాణి నీవిప్పు డిట్లని వచించి
నాశ్రద్ధ వృద్ధి నొందగ జేసితివి గాన
జన్మంబు నాకిపుడు సఫలమయ్యె
ధన్యనైతిని దేవ తలప్రీతికాస్పద
నైతిని నారుల కరసి జూడ
ఆ,వె. పతి సమానమైన గతి లేదు తత్ప్రీతి
యుభయలోక గతికి నుపచరించు
పతి ప్రసాదమున నె బడయు కీర్తి సుఖంబు
నితరదైవమింతి కెప్పుడు గలదు.
గీ. ఆర్య యోమునికి నై యిందు వచ్చితో
పేలంకు మిక మహాను భావురాల
భర్తవలన[illegible] నుతి నావలననో
జేయవలయు దాని జెప్పుమన్నిన
వ. అనసూయ కౌశికపత్ని కిట్లనియె.
సీ. వీరె యిందాది బృంద దారకుల్ నను గాంచి
వగచిరి భక్తదీయ వ్యాగపాస్త
సత్కర్మ దిక్వగాత్రి సన్నిరూపణులై
పూర్వరీతి ఖండము నవహార్ల
శాదిదశాక్షిని యాచించి రేనుత
దర్థమై యిచటికి నరుగుదెంచి
నినుగాంచితిని విను నీరజలోచన
పవలు లేకున్నను బహులయాగ
ఆ,వె. కర్మములు నశించె కర్మవిచ్ఛిత్తిచే
దేవతలకు పుష్టి భావమయ్యె

దినము లేనినాఁడె ♦ దెగు నన్నికర్మము
లందుచే నవగ్రహంబు బొడము.

క. దానన్ జగము నశించున్
గానన్ సత్యమున నీ జ ♦ గంబును విపదం
భోనిధి సముద్ధరింపగ
బూని యుదయ మొందఁ జేయు♦ము రవిన్ కిరణన్.

వ. అనిన నా బ్రాహ్మణి యిట్లనియె.

గీ. విను మహాభాగ మాండవ్య ♦ ముని శపించె
సవిత యుదయింప నాభర్త ♦ సమయునట్టు
లేమసేయుదు ననిన న ♦ య్యింతి బలికె
సాధ్వి విను మేను జెల్కొద ♦ సత్యముగను.

క. ఆముని వచనముచే నీ
భూమీసురు డేమియైన ♦ పూర్వమునవలె నీ
స్వామి శరీరము కోమల
మై మెరయగ జేతు నమ్మ ♦ మాగన వినుమా.

క. పతిదేవతల మహాత్మ్యము
సతతంబభివంద్య మహాత్మ ♦ సన్మానింతున్
మతిదలపు మనిన కౌశికు
సతిగా నిమ్మాటలె యనుచు ♦ సమ్మతి బడిసె

క. అనసూయ సదర్ఘ్యాంజలి
గొని పదిదినమ్ము లొక్కరాత్రైన ♦ ఘోరమగు నిశ
న్వి నియతమై సూర్యుని ర
మ్మని పిలిచెను దక్షణంబ ♦ మార్తాండుండున్

గీ. ఫుల్లపద్మారుణారుణ ♦ పూర్ణమండ
లంబు దనరగను దయాచ ♦ లంబు నెక్కి

నంతలోన నె కౌశికు ♦ డపగతాసు
డగుచు బడియెను భూపృష్ఠ ♦ మందు నంత.

ఉ. ఆతని పత్ని దాని తను ♦ వల్లన బట్టి ధరింప నత్తరి
[illegible]
జూతువుగాక భద్రగుణ ♦ జూడు మటంచును నత్రి భార్య వి
ఖ్యాత చరిత్ర సాధ్వి మహి ♦ మాతిశయం బలరంగ నిట్లనెన్.

సీ. భర్తృశుశ్రూషచే ♦ బాతివ్రత్యమా తపము నా
కించుకంతైన వ ♦ ర్తించెనేని
భర్తతో సరిగాగ ♦ పరపూరుషుని యెట్టి
చోటనైనను మది ♦ జూడనేని
మహనీయ రూపవా ♦ ఙ్మాధుర్యములచేత
నొరునితో బతిభేద ♦ మరయనేని
భర్తతో సమమైన ♦ పరదైవతము నొండు
వేతనిద్రనైన భా ♦ వించనేని

తే.గీ. యట్టి నా సత్యమున నిప్పు ♦ డిట్టి విప్రు
డఖిల రోగములను బాసి ♦ యౌవనంబు
దనర జీవితమును బొంది ♦ దారయుక్తు
డగుచు నుండెడుగాత నూ ♦ రబ్దములను.

క. మనమున వాక్కున కర్మం
బున పతిశుశ్రూషయుం దె ♦ ప్పను నుర్వ్యుక్తిన్
దనరితినేని నిరామయు
డునుయువడై ద్విజుడు బ్రతికె ♦ డు నేనులరంగన్.

క. అని యిటు లనసూయ వచిం
చిన విప్రుడు లేచె మరల ♦ జీవితుడై జ
వ్వనము నిరోగతయున్ దగ
తనుకాంతుల వేశ్మ వెలుగ ♦ దగె దేవుడనన్ .

గీ. పుష్పవృష్టి గురిసె ♦ భోరున దేవదుం
దుభులు మ్రోసె ముదము ♦ తొంగలింప
నఖిల సురలు నిట్టు ♦ లని రససూయుతో
పానము కిన్ను నేమి ♦ వారితో చెప్పుచూ.

గీ. వినుము కల్యాణి జేసితి ♦ విబుధకార్య
మధిక దుష్కర్మ మటుగాన ♦ నమరులెల్ల
వరదులైరి నీ మదినున్న ♦ వాంఛితంబు
దీర నడుగు మనంగ సా ♦ ధ్వియు వచించె.

క. కమలభవుడు మొదలగు నీ
యమరులు నాపై బ్రిసన్ను ♦ లైరేని సురో
త్తములార వరము గొన న
ర్హమైన దాననయి నట్టు ♦ లరసితిరేనిన్.

గీ. బ్రహ్మ విష్ణు మహేశ్వరుల్ ♦ పరమ కృపను
బుత్రులై నాకు గ్రమమున ♦ బుట్టవలయు
పతియుతంబుగ యోగంబు ♦ బడసి క్లేశ
ముక్తి గనగా వలయునని ♦ ముదిత బలుక.

క. సురలెల్ల తేనమస్త్వని
పరమామోదమున నత్త్రి ♦ పస్విని నధికా
దరమున కొనియాడుచు నా
హరిహర కమలాసనాదు ♦ లరిగిరి దివికిన్.



67. తల్లిదండ్రులయెడ నడువవలసిన విధి విషయము.



సీ. అరయ నాచార్యుండు ♦ పరతత్వరూపంబు
దండ్రి దలంపగ ♦ ధాతరూపు
రూపింప భ్రాతమ ♦ రుత్పతి రూపంబు
తెలియంగ తల్లి భూ ♦ దేవిరూపు

భగిని దయారూపు ♦ భావంబు ధర్మ స్వ
రూపంబు దానర్థి ♦ రూపు మొదల
నభ్యాగతుఁడు మున్న ♦ యగ్ని దేవుని రూపు
సర్వభూతములు కే ♦ శవునిరూపు

తే,గీ. గాన తండ్రి వేగ ♦ గడు నార్తులకు పితృ
జనులమైన మమ్ము ♦ జల్లఁజూచి
పరభయంబు వాపి ♦ నిరుపమంబగు తపో
మహిమచేత మెరసి ♦ మనుపుమయ్య.

సీ. జననుత వీరు నా ♦ జననియు జనకుండు
జువ్వె వీరలకు శు ♦ శ్రూష జేసి
ఇట్టి పరిజ్ఞాన ♦ మేను ప్రాపించితి [illegible]
నమ్మకుల బూజింతు ♦ రథి నెల్ల
వారును నొందను దై ♦ వంబును నొల్లకీ
వృద్ధులు నాపాలి ♦ వేల్పులనుచు
గమనీయఫలపుష్ప ♦ గంధ భూషణ వస్త్ర
ములు మనోహర భక్ష్య ♦ భోజ్యములను

తే,గీ. వీరి కెప్పుడు నివేదింతు ♦ వేడ్క బుత్ర
దార సహితుండనై నియ ♦ తముగ శేవ
యాచరింతును వేదముల్ ♦ యజ్ఞములును
వ్రతములును వీర నాకును ♦ వ్రతము దృఢము.

ధర్మవ్యాధుడు కౌశికునకు చెప్పుట. (భారతము.)

గీ. గురువు లందరిలో నైదు ♦ గురు విశేష
పూజ్యులందును మిగుల నొగి ♦ పూజ్యతములు
వారిలో మాతృపూజ స ♦ ర్వంబుకంటె
నంతకంటెను దైవత ♦ మన్య మేది. (కూర్మపురాణము)

గీ. తల్లితో తుల్యమైనట్టి ♦ దైవమేది
తండ్రికంటెను గురుడిక ♦ ధాత్రి గలడె
వారలకు దగు సత్కృప ♦ కారమెన్న
నొకటి గలగన వశమె యే ♦ మున్నదింక.

క. మాతాపితాపరాయణు
లై తనరు మహానుభావు ♦ లశ్రమమున గో
పైతృమహాసురగంధ
ర్వాతతలోకములు గన స ♦ మర్థులు చెలియా.

చ. మునుకొని తండ్రి యాజ్ఞ దల♦మోచి నిజోచిత కృత్యమేమి పం
చిన దన శక్తిచేత నెడ ♦ సేయక చేయుట పుండరీకలో
చన పదసేవ చేయుట ప్ర ♦ జాపరిపాలనశాలి యాటయుఁ
జననుతుఁడై సుతుండ పర ♦ చర్య లొనర్చుట చువ్వె పుత్రకా.

చ. అన విని రాముడిట్లనియె ♦ నార్యజనోత్తమ పుత్రలబ్ధికై
పనిగొని తల్లిదండ్రి పడు ♦ పాటులకుం బ్రతిసేయనౌనె యిం
పున దలజూచి నీళ్లు కడు ♦ వుం గని యన్నము పోశిపెట్టి మొ
డను జడిగాలి బోత్రితురు ది♦నంబును వారలతుల్యులే యొరుల్
(ఆంధ్రవాల్మీక రామాయణము.)

క. తనుదాను గాచుకొన జా
లని దశ నేమఱక యెపుడు ♦ లాలించుచు వ
ర్ధన మొనరింతురు సత్ప్రియ
మును బల్కుదురయ్య వారు ♦ ముచ్చట మీఱన్.

ఆంధ్రవాల్మీక రామాయణము. శ్రీరాములు వసిష్ఠునితో చెప్పుట.

వ. మనుష్యునకు తల్లిదండ్రి ఆచార్యుడు వీరలే ముఖ్యము లగు దైవములగుదురు. శరీరమును కలుగ జేయుటచేతను సన్మార్గ మును బోధించుటచేతను ఆముగ్గురే ముఖ్యులగుదురు. ఏకాలమందు ను వారిని పూజింపవలయును. వారు చెప్పినరీతిగా నడువవలయును.

తల్లిదండ్రుల పూజించు వానికి దేవబ్రాహ్మణ పూజయు పుణ్యస్థల యాత్రయు తీర్థయాత్ర మొదలయిన వానిని చేయకున్నను చేసిన ఫలమిచ్చును. సమస్తపాప విమోచకుడగును. (గరుడ. 11 వ అ.)

క. చెల్లుబడి గలిగి యెవ్వడు
తల్లికి దండ్రికిని దేహ ♦ ధనములు వృత్తుల్
చెల్లింపడట్టి కష్టుడు
ప్రల్లదుడామీద నాత్మ ♦ పలలాశి యగున్.

తా. ఏమనుజుడు తనకు సాధ్యమైనంతవరకు తల్లి దండ్రులను పోషింపడో అట్టిమనుజుడు మరణించి యమలోకమునకు బోయినపుడు నాతనితో యముడిట్లనును. నీ దేహమునకు కారణులగు తల్లిదండ్రుల నీవిహలోకంబున పోషించలేదు గాన నీకిచ్చుట దినుటకేమియును లేదు నీ దేహావయవములను గోసికొని వాటిని భక్షింపవలయునని యముండు జెప్పునని శాస్త్రములలో జెప్పి యున్నది. గాన ఆస్తికమతావలంబకు లందరు తల్లిదండ్రుల బోషింపవలయును.

---

## 68. అన్నదమ్ముల విషయములో నడువవలసిన ధర్మము.

---

క. విను భక్తియు వెరపు గలిగి
యనుజన్ములు పెద్దవాని ♦ నారాధింపన్
జనవర యతండు దమ్ముల
గొనియాడన్ సిరికి బట్ట ♦ గు నురుజ్జ్వలులై.

క. అనుజుడొకడు వెంగలియై
నను దప్పెడు గాని పెద్ద ♦ నకు గార్యజ్ఞా
న నిరూఢి లేక తక్కిన
యనుజన్ములు సిక్కువడుదు ♦ రవనీనాథా.

చ. జనవర యన్నదమ్ములు ప్ర ♦ సన్నమతిన్ గలకల్మి పంచి కు
డ్చిన వినుతించు లోకమును ♦ శ్రీయు బొరింబొరి పెంపునొందు లో

భనిరతి పెద్దకాసపడి ♦ పాడితొరంగిన బాలిణగొడ్డపుం
బనులగు సవ్విధంబు మన ♦ పడ్డదిగాదె జగం బెఱుంగగన్.

తే,గీ. తండ్రి పిమ్మట నన్నయ ♦ తండ్రి పిన్న
వారలకు నెల్ల నాతని ♦ వనిత తల్లి
తల్లికడ చన్ననని చెప్పి ♦ తాత మఱియు
మనుమనికి నిట్టులను నభి ♦ మన్యుపౌత్రి.

క. మానవనాయక యగ్రజు
డైనను ననుజన్ముడేని ♦ నన్యాయంబున్
బూని సహోదరులకు గీ
డైన నతడు దండ్యుడందు ♦ రవనీపతికిన్.

## 69. దేవతల కిచ్చు హవిస్సుల ఫలిత విషయము.

(మార్కండేయ పురాణము.)

సీ. వసుధ నరుల్ హవి ♦ ర్వర్షంబుచే నూర్ధ్వ
వర్షులౌదురు జల ♦ వర్షముననుం
మన మధోవర్షుల ♦ మనబడుదుము నిత్య
నైమిత్తికములనే ♦ నరులు మనకు
సంతుష్టి జేసెదు ♦ రన్నంబులను మాని
వారె భుజింతురో ♦ వారి దుష్ట
బుద్ధుల నాశంబు ♦ బొందింప క్షితిజలా
నలవాయువుల నతి ♦ కలుషములుగ

గీ. జేసి దోషంబులను గల్గ ♦ జేతుమంత
మనుజులాదుష్ట తోయాదు ♦ లనుభవింతు
రందునను మృత్యు హేతువు ♦ లగు నుపద్ర
వంబులను బొందెదరు స్వపా ♦ పంబువలన.

క. మనలఁ హవ్యంబులచే
దనిపి యెవరు శేషమునన * దనిసెదరో త
న్మనుజులకు సదన్వయమును
ఘనతర లోకముల నొసగి * కాతుము కరుణన్.



70. నాలుగు వర్ణముల ధర్మములను గురించిన వివరము.



క. దమమును శౌచము దపమును
శమమును మార్దవము గృపయు * సత్యజ్ఞాన
క్షమలును హరి భక్తియు హ
ర్షము నివలక్షణము లగ్ర * జాతికి నధిపా.

(సప్తమ స్కంధము)

ఉ. శౌర్యము దానశీలము ప్రసాదము నాత్మజయంబు దేజముఁ
ధైర్యము దేవభక్తియును * ధర్మము నర్థము గామముఁ బుధా
చార్యములకుంద సేవలును * సత్కృతియుఁ బరితోషణంబు స
ద్వీర్యము రక్షణంబు పృథి * వీవరశేఖర రాజచిహ్నముల్.

క. ధర్మార్థకామ వాంఛయు
నిర్మల గురుదేవ విప్ర * నివహార్చనముల్
నిర్మద భావము ప్రమదము
కర్మకరత్వములు వైశ్య * జన లక్షణముల్.

ఉ. స్తేయము లేని వృత్తియు శుచిత్వము సన్నుతియుఁ నిజేశుల
న్మాయలు లేక డాయుటయు మంత్రము చెప్పక పంచయజ్ఞముల్
సేయుటయు న్నగామరుల * సేవయు గోవుల రక్షణంబు న
న్యాయము లేమియుఁ మనుజ * నాథ యెఱుంగుము శూద్రధర్మముల్

తే. ఎట్టి వర్ణాశ్రమంబుల * నెట్టి ధర్మ
వితతి శాస్త్రోక్తమైయుండు * విడువ కెపుడు

నియతి దాని ననుష్ఠించు ♦ నిపుణమతులు
దక్కు నొరులచ్యుతు భజింప ♦ దగదు సుంత.

గీ. స్వకులవృత్తిని జీవింప ♦ శక్తుఁడయ్యు
నన్యధర్మంబు పూనుట ♦ నగుచు వృత్తి
సంకరంబిది గావున ♦ సకల జనులు
గడగి నిజవృత్తి వదలక ♦ నడువవలయు.

(విష్ణుపురాణము.)

---

71. చతురాశ్రమముల విషయము. (అశ్వమేధపర్వము.)

---

సీ. గురునకు బ్రియహిత ♦ కరుఁడయి వేదాధ్య
యన మొనరించుచు ♦ నశనమమల
భిక్ష నొనర్చుచు ♦ బిల్వపలాశ దం
డములలో నొకటి ధా ♦ ర్యముగ జేసి
స్నానశీలుఁడు బ్రహ్మ ♦ చర్యపరుండును
నియతేంద్రియుండును ♦ నిత్యశుచియు
యజ్ఞోపవీతియు ♦ నబహుభాషియు మేఖ
లాఢ్యుండు నైశయ ♦ నాసన ప్ర

గీ. చార విధములు సముచితా ♦ చరితములుగ
సత్త్వధర్మ నిరూఢుఁడై ♦ శాంతి గలిగి
వేల్మియిరుపొద్దు నడపుచు ♦ గల్మషంపు
బనుల కొలయక వర్తించు ♦ బ్రహ్మచారి.

సీ. అహర్నప్రకార స ♦ మావర్తనుండయి
నిజదార నిరతుండు ♦ నిర్మల ప్ర
చారుండు పంచయ ♦ జ్ఞపరుండు నతిథిశి
ష్టాశియు శుక్లవ ♦ స్త్రాన్వితుండు

శక్త్యను గుణదాన ♦ శాలియు నచపలేం
ద్రియుడును శుచియు నై ♦ త్రిపురుషును
స్వాధ్యాయశీలుండు ♦ సద్వ్రత నిష్ఠుండు
నై యజనంబు న ♦ ధ్యాపనంబు

గీ. శక్యమయిన సల్పి ♦ క్షమగల్గి సత్ప్రీతి
గ్రహ మొనర్చి మిత్రు ♦ లహితులనక
మాటకార్యముననుఁ ♦ మధ్యస్థుడై గృహ
స్థుండు నడచు దురిత ♦ దూరు డగుచు.

సీ. గ్రామంబు దొఱగి య ♦ రణ్య స్థలంబున
బర్ణశాలావాస ♦ పరత నొంది
స్నానతంత్రము రెండు ♦ సంధ్యల నమపుచు
బ్రహ్మచర్య వ్రత ♦ భాషియగుచు
బూరిపంటలు ఫలం ♦ బులు మూలములు శాక
సముదయంబును నశ ♦ నముగ గొనుచు
నజినంబువల్కల ♦ మంబరంబుగ గొని
శయన కృత్యంబు భూ ♦ స్థలి నొనర్చి

గీ. యతిథులకు నెపమిచ్చి యా ♦ హారములను
భక్తినాత్మీయములలోన ♦ బాచిపెట్టి
యధ్యయన హోమశీలుడై ♦ యన్ని యింద్రి
యముల గెలచి వానప్రస్థు ♦ డతిశయిల్లు.

సీ. సర్వభూతదయాను ♦ షంగంబు గలిగి య
తీత వస్తువుల చిం ♦ తింపకెదన
నాగతంబులమీద ♦ నాశసేయక వర్త
మానలబ్ధము లుపే ♦ క్షానిరూఢి
గూచుఁ జందములను ♦ గూనుఁ మెట్లట్ల యిం
ద్రియములలోనికి ♦ దిగిచికొనుచు

సముచితకాల భి ♦ క్షాచర్య దొరకొన్న
యంతన నిజదేహ ♦ యాత్ర నడపి

గీ. గ్రాసమాచ్ఛాదనంబు ద ♦ క్కంగ నెవ్వ
డర్థి నెయ్యది యిచ్చిన ♦ నందనేక
వారభోజ యగుచు నమ ♦ స్కార సఖ్య
మతి నిరాకృతి రహితుడై ♦ యతి వెలుంగు.

క. అనసూయయు నక్రోధం
బును దమమును బ్రహ్మచర్య ♦ మును ఋజుభావం
బును సత్యంబు నపైశున
ము నహింసయు జూవె యతికి ♦ ముఖ్య వ్రతముల్.

గీ. వృక్షమూల నదీతీర ♦ విజననిలయ
విపినగిరి గుహా నిత్య వి ♦ విక్తశేవ
సదసవాశియై కౌటిల్య ♦ సాధ్యవస్తు
సంచయనము లుడిగి యతి ♦ సంచరించు.

క. తనమేలు ప్రకాశింపక
తనుగనుగొనునట్టి జనులు ♦ దాసీనతమై
నునికికిదగియెడు చందం
బున వర్తించు యతి సర్వ ♦ ముక్తత నొందున్.

అశ్వమేధపర్వము. (అవ్యక్తనామ తత్వనిరూపణములో.)



## 72. ఆశ్రమములలో శ్రేష్ఠము. (కర్మయోగ శాస్త్రములో.)



వ. బౌధాయనాపస్తంబులు గృహస్థాశ్రమమె ముఖ్యమైన దనియు దానిచే నమృతత్వము ప్రాప్తియగుననియు స్పష్టముగ విధించిరి. బౌధాయన సూత్రమున "జాయమానోవై బ్రాహ్మణః త్రిభిర్ఋణవాన్ జాయతే" ప్రతి బ్రాహ్మణుడును జన్మ మొదలుకొని

మూడు ఋణములను తన వీపుపై వైచుకొని వచ్చినాడు అనునది మొదలుగాగల తైత్తిరీయ సంహితయందున్న వచనములను మొదట చెప్పి యనంతర మీ ఋణముల దీర్చుకొనుట కొరకు యజ్ఞయాగాది పూర్వకముగ గృహస్థాశ్రమము నాశ్రయించు మనుజుడు బ్రహ్మలోకము నొందుచున్నాడనియు బ్రహ్మచర్యముగాని సన్యాసముగాని ప్రశంసించు మనుజులు దుమ్ములో గలసిపోదురనియు జెప్పబడినది.

(బౌ ౨, ౬, ౧౧, ౩౩ మరియు ౩౪) మరియు నాపస్తంబ సూత్రమందును నవి యటులే విధింపబడి యున్నది. (ఆప ౨, ౯, ౨౪, ౮) ఈ రెండు ధర్మ సూత్రములలోను సన్యాసాశ్రమము వర్ణింపబడక పోలేదు. దానిని వర్ణించినను గృహస్థాశ్రమము యొక్క మాహాత్మ్య మధికమైనదని చెప్పబడినది. దీనివలనను విశేషముగ మనుస్మృతియందును కర్మయోగమునకు "వైదిక" మని విశేషణ మిచ్చుటచేతను కర్మత్యాగాను రూపమగు సన్యాసాశ్రమముకంటె నిష్కామకర్మయోగమైన గృహస్థాశ్రమము మనుస్మృతి యొక్క కాలము కంటెను ప్రాచీనమని తెలియుచున్నది. మరియు, కలియుగమందు సన్యాసాశ్రమము నిషేధింపబడినది.



## 73. రాజుయొక్కయు ప్రజలయొక్కయు అన్యోన్య ధర్మము.



క. రాజునకు ప్రజశరీరము
రాజు ప్రజకు నాత్మగాన ♦ రాజును ప్రజయుం
దాజోత్తమ యన్యోన్య వి
రాజితులై యుండవలయు ♦ రక్షార్చనలన్. భారతము.

క. తనవారు పెద్దసేయని
మనుజేశుని రాష్ట్రజనులు ♦ మదిని సరకు గా

గొనరది భూప్రజకొప్పదు
విను కావున బలికి బ్రజలు ♦ వెఱమట యొప్పన్.

చ. అతడును మందహాస సహి ♦ తాలపనంబును సత్యభాషణ
వ్రతమును సంవిభాగ నిర ♦ వద్యతయున్ సమభావమున్ గృత
జ్ఞతయు జితేంద్రియత్వము బ్ర ♦ సాద ఫలంబును గల్గి భూమికిం
బితృసముడై విరోధి జన ♦ భీషణ సారతనొప్ప బెంపగున్.

(శాంతి పర్వము. రాష్ట్రజనులకు అర్థ ధర్మము చెప్పుటలో.)

వ. అంగిరస భార్గవ ప్రముఖులగు పెద్ద లిట్లని చెప్పిరి. శ్రోత్రత్వ క్చక్షుర్జిహ్వాఘ్రాణంబులును వాక్పాణిపాదపాయూపస్థలును కర్మేంద్రియంబులును మనంబునుం గూడ జయించి కామజంబులగు నక్ష మృగయాస్త్రీపానార్థదూషణంబులను గ్రోధజంబులగు వాక్పారుష్యదండపారుష్యంబులను సప్తవ్యసనంబులం దగులక దుర్మంత్రిల కుటిల వాక్యంబులకు లోనుగాక యవిక్రమ క్రమజ్ఞులైన యమాత్యులతో దేవమానుష చింతనంబు చేయుచు యశుభనిరాసంబును శుభాపాదనంబును నొనర్చుచు బ్రజలం బాలించు భూపతి యుభయ లోకసిద్ధులం బొందు.

(శాంతి. బృహస్పతి వసుమనస్సను రాజునకు చెప్ప రాజనీతిలో.)

గీ. ప్రజల నౌరస పుత్రుల ♦ పగిది బ్రోచు
చును సమస్తాధ్వరముల వి ♦ శుద్ధమతిని
పూర్ణ దక్షిణ లిచ్చి య ♦ పూర్వ రీతి
జేసె ఋత్విక్పురోహిత ♦ చిత్తశత.

(మార్కండేయము. మరుత్తు చరిత్రలో.)



## 74. కృతఘ్నత విషయము.



### 1. మేలు చేసిన వాని కపకారము చేయుట.

2. మేలు చేయుచుండు తరిసే అపకారము చేయుటయు కృతఘ్నత యనబడును.

(భారతము. నాళీజంఘుని చరిత్ర చెప్పుటలో.)

వ. నైమిశారణ్యంబున నాళీజంఘుండను నొక బకంబొక వట వృక్షమును నాశ్రయించి యుండెను. అచటికొకనాడు ధనాశాపీడి తుండగు నొక బ్రాహ్మణుండు రాగా నాబకంబతని జూచి గౌర వించి యతని మిత్రుండగు విరూపాక్షునిచే నతనికి కావలసిన ధనం బిప్పించె. అంత నాబ్రాహ్మణుండు నాళీజంఘుండను బకంబతనికి చేసిన మేలును మరచి నాళీజంఘుండు నిద్రబోయెడు సమయంబున నతనిజంపి తన్మాంసంబు భక్షించెను. తదుపరి నాళీజంఘుని మిత్రుం డగు విరూపాక్షుం డీసంగతి తెలుసుకొని యా విప్రుని జంపించి యతని శరీరమును బారవేయుగా నట్టి కృతఘ్నుని శరీరంబు శునకం బులు కూడ తిననొల్లవయ్యె.

క. వెడకండ నెత్తుగొలుకం
బడద్రోచిన వచ్చి కుక్క • పదుపు వెనుకకుఁ
జడిసె గబళింప నొల్లక
కడుపులు నకనకఁ పడంగ • గౌరవ ముఖ్యా.

వ. అని భీష్ముండు.

క. విను మది యట్టిద కుక్కలు
దినగా రోయును గృతఘ్ను • దేహము మాంసం
బని చెప్ప నాగమంబులు
మనుజేశ్వర తెల్లమయ్యె • మనకిచ్చోటఁ.

అని పలికి వెండియు నిట్లనియె.

క. అరయ మిత్ర ద్రోహము
దారుణమగు పాతకము కృ • తఘ్నతకంటెన్
నైరముగొని విడువవలయు
న్నారెండు దెజగుల వారి • నాప్తులనైనన్.

## 75. ముఖ్యమైన యజ్ఞములు.



చ. వినుము ప్రభూతదానములు ♦ విశ్రుత యజ్ఞములుం సధర్మతా
వినుతికి నెక్కుఁజాలవు వి ♦ వేకనిధీ పరిశుద్ధశోభితా
ర్జనమున దెచ్చుకున్నది ది ♦ రంబగు పాత్రము నర్హకాలముం
గని లఘువస్తువేని నొస ♦ గంగడునుజ్వల ధర్మమారయం.

(అశ్వమేధ పర్వములో సక్తుప్రస్థుడనే బ్రాహ్మణుండు సకుటుంబముతో బ్రహ్మలోకమునకు బోవుటలో.)

క. విను పశుయజ్ఞము హింసన
మనంతఫలదంబుగా ద ♦ హంకృతి సహితం
బనఘా వాఙ్మన సమయం
బను యాగంబిచ్చు నవ్య ♦ యానందంబుం. (శాॱపॱ)

గీ. వివిధ సంకల్పయజ్ఞము ♦ ల్విడిచి యాత్మ
యందు నిష్టమై నగ్ని స ♦ మాహితముగ
జేసి నిస్పృహుడై విష్ణు ♦ చిత్తవృత్తి
చేర్చువాడవ్యయస్థితి ♦ జెందనేర్చు. (అనుశాసనీకము.)

క. యజ్ఞంబులలోన తపో
యజ్ఞంబుత్తమము దాని ♦ నాదరణమునం
బ్రాజ్ఞోత్తమ జేయుము స
ర్వజ్ఞుడు ప్రీతుడగు శాంత ♦ రసమొప్ప జుమీ.

(అశ్వమేధపర్వము.)

గీ. పరము డీశ్వరుండు ♦ బ్రాహ్మణ ముఖమున
నాహరించి తుష్టు ♦ డైన భంగి
నగ్ని ముఖమునందు ♦ హవ్యరాసులు గొని
యైన దుష్టినొంద ♦ డనఘ చరిత. (భాగవతము)

సీ. అమరాధిపతి తొల్లి ♦ యాగంబు సేయంగ
దొడగ మహాముని ♦ స్తోమములును
సురసంఘములు గూడి ♦ కురుముఖ్య ఋత్విగ్జ
నముల నేర్పరచి సొం ♦ పమర వేది
గల్పించి తగ నగ్ని ♦ కార్యంబు నడపంగ
నర్హాలు పశునిచ ♦ యంబు దేర
నమ్మును ల్గనుగొని ♦ యధిక దయార్ద్రంబు
లగు చిత్తములతోడ ♦ నమ్మహేంద్రు

గీ. నాననంబు జూచి ♦ యక్కట హింస ధ
ర్మంబుగాదు క్రతయు ♦ గంబు సొచ్చె
ననఘ వత్సరత్ర ♦ యము పాతలయిన బీ
జంబు లిపుడు యజన ♦ సాధనములు. (అశ్వమేధపర్వము)

మరియు నగస్త్యులవారు హింస రహితంబుగా జన్నము చేసినట్టు లున్నది. (అశ్వమేధం చివరను.)

శ్లో॥ శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్। జ్ఞానయజ్ఞఃపరంతప
సర్వం కర్మాఖిలంపార్థ। జ్ఞానేపరిసమాప్యతే॥ భగవద్గీత॥

తా. ద్రవ్యమయమగు యజ్ఞము కంటె జ్ఞానము శ్రేష్ఠము. సమస్తమైన కర్మములు జ్ఞానముచేత పూర్తియగును.

(అశ్వమేధపర్వంబున.)

వ. ధర్మరాజుయొక్క అశ్వమేధయాగ సమయమున విస్మయంబు జేయజాలునట్టిది యేమేని గలిగెనేని వినవలతునని యడిగిన యమ్మహీనాయకునకు వైశంపాయనుం డిట్లనియె.

క. అమ్మెయి బ్రభూత ధనలా
భమ్మున భూమి గల యట్టి ♦ బ్రాహ్మణు లెల్లన్
సమ్మోదమొంద హయమే
ధమ్ముజ్వలభంగి నొప్పె ♦ దత్సమయమునన్.

గీ. అఖిల జనములు నచ్చెరు ♦ వొంద ధర్మ
నందనుని మానసమున నా ♦ నంద మొలయ
నతనిపై మకరంద ధా ♦ రాభిశోభి
కుసుమ వర్షంబు పెల్లుగ ♦ గురిసె నధిప.

వ. అట్టియెడ.

సీ. ఒక్కబిలంబున ♦ నుండి వెల్వడి యొక్క
నకులంబు విప్రజ ♦ నంబు నడుమ
నిలచి సక్తుప్రస్థు ♦ నలఘు ధర్మంబు నే
మియుబోలదీ యశ్వ ♦ మేధమనిన
నవ్విప్రులతి విస్మ ♦ యంబంది యమ్ముంగి
గన్గొని మంత్ర వ ♦ ర్తనము దంత్ర
గమనికయును వివి ♦ ధములైన దానవి
ధులు బహుళత్యాగ ♦ ములును లోక

గీ. సంస్తుతములయ్యె భక్తియు ♦ శ్రద్ధయును బ్రి
యంబు వినయంబు సురము ని ♦ హర్షమావ
హిల్లజేసె సీ వేమిట ♦ నిమ్మహాధ్వ
రంబు గీడంటి చెప్పుమ ♦ పరిస్ఫుటముగ.

వ. అనుటయు నన్నకులంబు వారల కిట్లనియె. కురుక్షేత్రమున రోషకామవిరహితుండగు నొక మహాద్విజుండు ఉంఛవృత్తి చే దానును భార్యయు కొడుకును కోడలియు నలువురు జీవించుచుండ ననావృష్టిదోషమావహిల్లె. అట్టియెడ ఆహార మొనర జేసుకొనుటకు కఠినమై చెల్లుచుండ నొక దినంబు నతిథి యొక్క ధరామరుండరుగుదెంచిన బ్రియంబున వారెదుర్కొని బర్ణశాలాభ్యంతరమున నతని దోడుకొనిపోయి యాసనస్థునిగ జేసి అడుగులు గడిగి ప్రీతియెసలారగ దద్దయు నెమ్మిబల్కి తనపాలి సక్తువు నొసంగిన దాని నతడు తృప్తిబొందకునికి యేమిట నితండు తృప్తుడగు నట్లు సేయుదునొకో యను విచారంబు బొడమ దదీయ భార్య తదింగితంబూ

హించి యతనితోడ నాపాలి సక్తు నిచ్చెద నీ పురుషుని దృప్తిజే
యు మీరనిన నతడిట్లనియె.

క. మృగములు పక్షులులోనుగ
దగు నాహారములు దెచ్చి ♦ తమ ప్రియలకు నిం
పుగ నిచ్చు నాకు గాంగా
నగునె భవద్భోజ్యమయిన ♦ ద్రవ్యము సాధ్వీ.

వ. అనిన విని యవ్వనిత యతని వదనంబునంజూడ్కి నిలిపి

గీ. పతియ చుట్టంబు బక్కంబు ♦ పతియ చెలియు
పతియ తల్లియు దండ్రియు ♦ పతియ గురువు
పతియ దైవంబు గావున ♦ నతనిపని యొ
నర్చుటయ చూనె ధర్మంబు ♦ నాతికరయ.

వ. అని తన సక్తు నిచ్చిన ప్రియమ్మున సమ్మని యమ్మహా
ద్విజుం డైకొనుమన్న నతండు ప్రతిగ్రహించి భుజించినన్నారతగనుం
డిన నంతరాగము గనుగొని యత్తపస్వి చింతనొందిన తదీయ తన
యుండు తన్న శావశేషం బెరిగి తనపాలి సక్తువు తండ్రికిజూపి యీ
యతిథి తృప్తి నిజేయు మనఘ దీయనిన యెంత పాియంబుచనినను
జనకునకు సుతుండు బాలుండ యాకలికి బాలుడు కగ్గలమందుమురు
గావున నిది యనుచితంబనిన దనయుండు దండ్రి చిత్తంబునెర్గినిన
కృత్యంబాచరించుట యర్హధర్మమని విని యుంటిని గాన యిప్పెండి
ఈ మహాత్మున కిచ్చి నన్ను గావుమనిన గొడుకు మాటల కమ్మహా
త్ముండు ప్రీతుండై యాసక్తు నాయతిథి కిచ్చినంబుచ్చుకొనినను
యాకలివోని తెలుగు దోచిన యమ్ముని డెందంబు గుందునొంది
నం గోడలు తదాకార పరిణామంబు గనుంగొని తన యంశంబయిన
పిండి మామ ముందరికిందెచ్చి యిదియును నతిథికి నిండనిన పక్కట
యూకట దగిలిన యాగకములు శిథిలంబు లయినవి నెప్పాట జూక
జూ లనినవి వాలిన విరాపు [illegible]

ప్రాణములు సంగములు గలిమి యనిన సంయమివరుడీయ్యకొని
యతనికి నచ్చెలువ పాలి సక్తువు నిచ్చె.

ఉ. ఇచ్చిన బ్రీతి పుచ్చుకొని ♦ యింపెసలార భుజించి తృప్తిమై
నచ్చుపడంగ మెచ్చున ము ♦ ఖాంబురుహాంబులరంగ నిట్లనుం
బొచ్చెములేక యయ్యతిథి ♦ భూరిగుణోత్తమ నిన్ను జూడగా
నచ్చితి నేను ధర్మడ ధ ♦ నవ్రితశీలత జూచి మెచ్చితిన్.

క. భక్తియు వినయము శ్రద్ధా
యుక్తియునుం దాల్మితోడి ♦ యొప్పను గరుణా
సక్తియు నతిథులయెడ నను
రక్తియు నీయందు సుస్థి ♦ రత్వము బొందెన్.

క. నీదానంబున విస్మితు
లై దైవత యక్షసిద్ధు ♦ లభివర్ణన మ
త్యాదరమున జేసెదరిదె
రోదసి సమ్మర్దముగ న ♦ రుగుదెంచి దగన్.

క. అని చూపి పల్కునవసర
మున బర్జన్యుండు గురిసె ♦ బుష్పాసారం
బనవద్యహృద్యనాదం
బున మ్రోసెను దేవదుందు ♦ భులు గగనమునన్.

వ. అప్పుడయ్యతిథి వెండియు

క. నిను జూచువేడ్క నేవ్వరు
మునుల నుచంబు సముగ్ర ♦ ముగ గదిలెదు న
జ్జనకీర్తనీయ దివికిం
జనుదెమ్ము ప్రియాసుతస్నుషా ♦ సహితముగన్.

క. తగు ప్రియయును నకుటుంబం
బుగ దన నచ్ఛకేపురాళి ♦ బుద్ధింగవి ప్ర

# శ్రీవైష్ణవ పత్రిక.

శ్రీవైష్ణవ మతమందు నభిమానము కలవారును, ఆమత సిద్ధాంత రహస్యములను తెలియగోరువారును, ఆ మతము నభివృద్ధి నొందింప కుతూహలులగువారును, ముఖ్యముగా నీ పత్రికకు చందాదారులగుట మంచిది. స్వరూపధారు లందరు శ్రీవైష్ణవ పత్రిక నాదరించుట యుక్తము కదా ? ఇందు విశిష్టాద్వైత మత సిద్ధాంతములును, శ్రీవైష్ణవ ధర్మములును, పూర్వాచార్యుల దివ్యచరిత్రములు, వారి ప్రబంధములకు ఆంధ్రభాషాంతరీకరణములు, ప్రతిపద టీకాతాత్పర్యములును, శ్రీవైష్ణవ సంఘమునకు సంబంధించిన కొన్ని కీర్తనలు, సభలు, ఉపన్యాసములు మొదలగు ననేకోపయుక్త విషయములు ముద్రింపబడును. ఇది మాసపత్రిక. న్యూస్ పేపరు కాదు. దీనియం దిదవరకు కొన్ని యమూల్య గ్రంథములు వెలువడినవి. కాగితముల కరవువలన చందాదారులకు వలసినన్ని ప్రతులే ముద్రింపబడుచున్నందున నితరుల కాగ్రంథములు సరిగా దొరకుట దుర్లభము. కావున స్వమతాభిమానులెల్లరును జాగు చేయక దీనికి చందాదారులగుట మంచిది.

చందా సం॥ రు 1-8-0 లు మాత్రమే. వి. పి. ఖర్చులు వేరు.

మేనేజరు:—శ్రీవైష్ణవ పత్రికా కార్యాలయము,

పెంటపాడు, కృష్ణాజిల్లా.